# దొంగల దొర
(నవల)

మూలం: పుష్కిన్
అనువాదం:
శ్రీ వద్దిపర్తి వెంకట్రావు




పబ్లిషర్సు
ఉమా పబ్లిషర్సు,
విజయవాడ — విజయనగరం.

# దొంగల దొర

## (నవల)

చాలా కాలం క్రితం రష్యాలో "పాక్రోవుస్కోయ్" అనే గ్రామంలో "కిరిల్లా పెట్రోవిచ్ ట్రోయకురోవ్" అనే వొక జమీందారు వుండేవాడు. అతనికి అనేక గ్రామాలూ ఎస్టేట్లూ వుండేవి. అందులో "పాక్రోవుస్కోయ్" అనే గ్రామం ఒకటి. పెట్రోవిచ్ బాగా ఆస్తిపరుడే కాక గొప్ప వంశంలో జన్మించాడు. పెద్ద పెద్ద వాళ్ళతో స్నేహమే కాక బంధుత్వం వుండడంవల్ల అతనంటే అందరికీ భయమూ భక్తీ. అతని హోదాను చూసి ఆ వూళ్ళోవాళ్ళేకాక చుట్టుప్రక్కల గ్రామాల్లోవాళ్లు సైతం గౌరవించేవారు. సామాన్య ప్రజల మాటకేం,. ఉద్యోగస్థులుకూడా అతని అడుగులకు మడుగు లొత్తేవారు. అతను అవునంటే అవును; కాదంటే కాదు. అతని మాటకు తిరుగులేదు. అతని పేరు చెబితే పిట్టలు నీళ్ళుతాగేవి కావు. ప్రజల్నందర్నీ హడలెత్తించి సకల గౌరవమర్యాదలు పొందే హక్కు తనకు వున్నదని పెట్రోవిచ్ విశ్వాసం. తనొక జమీందారు. తన బంధువులంతా ఉన్నతవంశీయులు. కనుక తనుయేంచేసినా చెల్లుబడి అవుతుందని అతని అహంకారం!

పెట్రోవిచ్ భవనం ఎప్పుడూ అతిథులతో కలకల్లాడుతూ వుండేది. నిత్యం జరిగే విందులకు ఘరానా మనుష్యులు హాజరై జల్సాగా కాలక్షేపం చేస్తూవుండేవారు. జమీందారీ

సరదాలకి అంతూపొంతూ లేదు. ఒకరి మనసు నొప్పికలుగు తుందని కాని ఎవరైనా యేమన్నా అనుకుంటారని కాని అతనికి జంకూ గొంకూ ఉండేదికాదు. సరదాల పేరిట చిలిపి చేష్టలెన్నో చేసేవాడు. ఎంతటివాడైనా సరే; తనురమ్మ న్నప్పుడురావాలి. కొన్నిప్రత్యేక దినాలలో పెట్రోవిచ్ దర్శ నం చేసుకోవాలి. అతని మాటను కాదనే ధైర్యం ఎవరికీ ఉండేదికాదు!

అయితే పెట్రోవిచ్‌కి చదువురాదు. విద్యలోపం అతని నడవడికలో కనిపించిపోయేది. జల్సాగా పెరగడంవల్ల తనకో రికలన్నీ యిట్టే నెరవేరాలని మంకుపట్టుపట్టేవాడు. అతని బుద్ధికి ఎంత తోస్తే అంత. ఏమైనా తన కోరిక చెల్లిపోవ ల్సిందే. పెట్రోవిచ్ బలవంతుడు. అయినా అతిగా తినడం వల్ల వారానికి రెండుమూడుసార్లు అజీర్తితో బాధపడేవాడు. తెగ త్రాగి నిద్రపోయేవాడు.

అతని భవనంలో ఒక భాగంలో పదహారుగురు దాసీ పడుచులు వుండేవారు. అల్లికపని చేసుకుంటూ వాళ్లు కాలం గడిపేవారు. వాళ్లుండే గదుల కిటికీలకు కొయ్యవూచలు. తలుపులుమూసి తాళాలువేసి వాళ్ళను అక్కడ బంధించి ఆ తాళం చెవులు తన దగ్గరే వుంచుకునేవాడు పెట్రోవిచ్. ఏవో కొన్ని గంటలు మాత్రం ఆ ఆడపిల్లలు తోటలో తిరగవచ్చును. కాని ఒంటరిగా మాత్రం మసలకూడదు. అందుకని ఒక ముసలి దాసీని కాపలాపెట్టి వాళ్ళని తోటలో తిరగనిచ్చేవాడు. కొంతకాలానికి తన సరదాతీరాక ఆ పిల్ల

లకు పెళ్ళిళ్లు చేసేవాడు. వాళ్ళు అత్తవారింటికిపోగానే కొత్త వాళ్ళను తీసుకువచ్చేవాడు. మళ్ళా యిదే తంతు.

పెట్రోవిచ్ అహంకారి, నిర్దయుడు. రైతుల్ని నౌకర్లనూ తూలనాడేవాడు. ఏడిపించేవాడు. అయినప్పటికీ వాళ్లు అతనిపట్ల విధేయులైవుండేవారు. పైపెచ్చు తమ జమీందారు ఎంతో గొప్పవాడనీ అలాంటి కుబేరుని కొలువులో తాము నౌకర్లుగా వుండడం కేవలం పూర్వజన్మ సుకృతమని భావించేవారు. తాము ఏ పని చేసినా ఫరవాలేదనుకునేవారు. అంతటివాడి అండదండలు తమకు వున్నాయని విర్రవీగేవారు. జమీందారు భృత్యులు కనక తాము ఏపని చేసినా ఊళ్ళో అడిగేవాడు లేడనిగూడా అహంకరించేవారు. పెట్రోవిచ్ చేసే పనులల్లా వేటాడ్డం విందులు చేయడం; వేళాకోళాలూ వెక్కిరింతలూ అతని సరదాలు. పరిచయస్థులనే కాక అపరిచయస్థులను సైతం అతను ఎగతాళి చేసేవాడు. అతని వెక్కిరింతలకు లోనుకానివ్యక్తి ఎవరైనావుంటే అతను "డుబ్రోవుస్కీ" ఒక్కడే.

డుబ్రోవుస్కీ పటాలంలో చిన్న ఉద్యోగి. అతని స్వగ్రామం పెట్రోవిచ్ వుండే గ్రామానికి దగ్గరలోనేవుంది. డుబ్రోవుస్కీకి కూడా డెబ్బయి సెర్ఫుల ఎస్టేటువుంది. ఎటువంటి గొప్పవాళ్లనైనా ఎగతాళిచేసే పెట్రోవిచ్ ఎందుచేతనో డుబ్రోవుస్కీని మాత్రం చాలా గౌరవించేవాడు. వీళ్లిద్దరూ పటాలంలో స్నేహితులు. అందుచేత డుబ్రోవ్ స్వభావం పెట్రోవిచ్‌కి బాగా తెలుసు. పరిస్థితులువల్ల చాలాకాలం వీళ్లిద్దరూ కలుసుకోలేదు. డుబ్రోవ్ ఉద్యోగంమానిపించను

పుచ్చుకొని తన స్వగ్రామానికి వచ్చేయాలనుకున్నాడు. ఈ విషయం తెలుసుకుని పెట్రోవిచ్ అతనికి సహాయపడతానని వర్తమానం పంపాడు. అందుకు డుబ్రోవ్ సంతోషించినా, అతని సహాయం మాత్రం కోరలేదు. స్వతంత్రంగా, సామాన్యంగా బ్రతకాలనుకున్నాడు. కొన్నాళ్ళ తర్వాత పటాలంలో సేనానిగా పనిచేసిన పెట్రోవిచ్ కూడా పింఛను పుచ్చుకుని తన స్వగ్రామమైన పుకోవ్రుస్కోయ్‌కి వచ్చేశాడు. అప్పుడు పాతస్నేహితులు మళ్ళీకలుసుకొని ఆనందించారు. అప్పట్నుంచీ వాళ్ళిద్దరూ కలుసుకోని రోజంటూ లేదు. ఒకళ్ళయింటికి వెళ్ళని పెట్రోవిచ్ తరుచు డుబ్రోవు యింటికి వెళ్ళేవాడు; వీళ్ళిద్దరి వయస్సూ సమానం. సంఘంలో వీళ్ళిద్దరిదీ సమానహోదా. ఇద్దరూ సమానంగా పెరిగారు. వాళ్ళ నడవడిలో, అలవాట్లలోకూడా భేదం కనిపించదు. కొన్నివిషయాల్లో వీళ్ళ జీవితాలుకూడా ఒకలాగే గడిచాయని చెప్పవచ్చు. ఇద్దరూ ప్రేమించిన వాళ్ళనే పెళ్లాడారు. పెళ్ళయిన కొన్నాళ్ళకే ఇద్దరి భార్యలూ చచ్చిపోయారు. ఇద్దరికీ ఒక్కొక్కరే సంతతి, డుబ్రోవుకి కొడుకు; పెట్రోవిచ్‌కి కూతురు. డుబ్రోవు కొడుకు 'పీటర్సుబర్గు'లో చదువుకుంటున్నాడు. పెట్రోవిచ్ కూతురు తనదగ్గరే వుంది. పెట్రోవిచ్ డుబ్రోవుతో అనేవాడు "నేస్తం! నీ కొడుకు గాని ప్రయోజకుడైతే బీదవాడైనప్పటికీ అతనికే మా అమ్మాయి 'మాషా' నిచ్చి పెళ్ళి చేస్తాను." కాని డుబ్రోవుమాత్రం తల ఆడించి వద్దు పెట్రోవిచ్! మా అబ్బాయి 'వొలోడ్యా'కి నీ కుమార్తెను పెళ్ళాడే అర్హతలేదు. వాడు బీదవాడు. ఒక గొప్పయింటి

అమ్మాయిని పెళ్ళిచేసుకు ఇల్లరికపు అల్లుడనిపించుకోవడం కంటె పేదపడుచునే పెళ్ళాడి ఒక యింటికి పెద్ద అనిపించుకోవడమే మంచిది" అని జవాబిచ్చేవాడు.

వీళ్ళిద్దరి స్నేహంచూచి అందరూ కళ్ళుకుట్టుకునేవారు. తతిమా వాళ్ళలా కాకుండా, దుబ్రోవు చాలా చొరవగా ఉండడం అందరికీ ఆశ్చర్యం వేసేది. విందువేళలో దుబ్రోవ్ స్వేచ్ఛగావచ్చి, తనకి తోచినమాటలు 'స్వతంత్రంగా అనేవాడేగాని పెట్రోవిచ్ కి తన మాటలు రుచిస్తాయో రుచించవో అని భయపడేవాడుకాదు. కొందరు దుబ్రోవులాగ స్వతంత్రంగా మాటాడాలని ప్రయత్నించారు గాని పెట్రోవిచ్ వాళ్ళమీద దండయాత్ర సాగించేసరికి వాళ్ళ ప్రయత్నాలు ఆగిపోయేవి. ఒక్క దుబ్రోవుకి మాత్రం ఈ చట్టం వర్తించలేదు. కాని అప్పుడు జరిగిన ఒక సంఘటన యీ కథనంతా తారుమారుచేసింది.

ఒక రోజున పెట్రోవిచ్ వేటకి బయల్దేరడానికి ఏర్పాట్లుచేశారు. అంతకుముందే మర్నాడుదయం అయిదుగంటలకల్లా వేటగాళ్లూ గుర్రపురౌతులూ హాజరుకావాలని ఆజ్ఞాపించాడు మధ్యాహ్నం భోజనం ఎక్కడ ఏర్పాటుకావాలనుకున్నారో అక్కడికి డేరాలు, వంట సామానులూ పంపించాడు. పెట్రోవిచ్ అతిథులతోబాటు వేటకుక్కలు, జాగిలాలు ఉండే మందిరానికి వెళ్ళాడు. అక్కడ అవి అయిదువందలికి పైగా మస్తుగా పెరిగి యజమాని గొప్పదనాన్ని తమ భాషలో పొగడుతున్నాయి. జబ్బుచేసిన కుక్కలకి అక్కడ ఒక ఆస్పత్రికూడావుంది. ఆ ఆస్పత్రికి 'టిమోష్కా'

అనే అతను డాక్టరు. ఆస్పత్రిలో పురటాళ్ల గదులు వేరే ఉన్నాయి. అందులో మేలుజాతి ఆడకుక్కలు పిల్లల్ని పెట్టి పాలిస్తాయి.

ఈ అస్పత్రిని చూసుకొని పెట్రోవిచ్ మురిసిపోయి గర్వపడడమేకాక అతిథులందర్నీ చూడమనేవాడు. వాళ్లు ఏ ఇరవైసార్లో ఈ కుక్కల మందిరం చూసేవారు; చూసి నప్పుడల్లా పొగిడేవారు. ఇప్పుడు మళ్లీ అతిథులందరితో బాటు కుక్కలమందిరానికి వెళ్లాడు పెట్రోవిచ్. కుక్కల మందిరం చూసేవారు; చూసినప్పుడల్లా పొగిడేవారు! ఇప్పుడు మళ్లీ అతిథులందరితో బాటు కుక్కల మందిరానికి వెళ్లాడు పెట్రోవిచ్. కుక్కల మందిరం కావలివాడూ కుక్కల డాక్టరు టిమోష్కా ఇద్దరూ వచ్చారు. పెట్రోవిచ్ ప్రతిగదీ తనిఖీ చేసుకుంటూ, జబ్బుకుక్కల ఆరోగ్యం గురించి అడుగుతూ అప్పుడప్పుడు వాటి పెద్దల్ని గద్దిస్తూ, తన కిష్టమైన జాగిలాల్ని పేరు పెట్టి పిల్చి తాకుతూ నడిచాడు. అతిథులు ఆ కుక్కల్ని పొగడడం తమ విధి అనుకునేవారు. దుబ్రోవ్ మాత్రం లోపల మండిపడుతున్నా మౌనంగా ఉన్నాడు. దుబ్రోవుకి కూడా వేట అంటే సరదాయే గాని తన తాహతుకు తగ్గట్టు ఒక జత జాగిలాల్నీ, ఒక జాతి వేటకుక్కల్నే మాత్రం పెంచుతున్నాడు. అందుచేత ఈ కుక్కల పటాలాన్ని చూసి కొంచెం ఈర్ష్యపొందక పోలేదు. మౌనంగా వున్న దుబ్రోవును చూసి, పెట్రోవిచ్ కారణం అడిగాడు:

"ఏం దుబ్రోవు! అలా మౌనంగా ఉన్నావ్ ... నా

కుక్కలు నీకు నచ్చలేదా" వెంటనే దుబ్రోవ్ ఇలా జవాబు చెప్పాడు:

"పెట్రోవిచ్! నీ జాగిలాలు నిజంగా ఒకటో రకం మేలుజాతి కుక్కలే! నీ నౌకర్లెవరూ ఈ కుక్కలపాటిసుఖంగా బ్రతకరేమో! అక్కడ కుక్కల్ని పెంచే వేటగాడికి ఆ మాటకి కోపం వచ్చింది.

"దేవుడి దయవల్ల, మా యజమాని దయవల్ల మాకే కొరతా లేదు లెండి ఏ భూస్వామి చూసినా ఇక్కడవున్న ఏ జాగిలానికైనా తన ఎస్టేటంతా ఇచ్చి తీసుకోడానికి సిద్ధమౌతాడనేది నిజమే. ఎందుకంటే ఆ భూస్వాములకంటే మా జాగిలాలే బాగా బ్రతుకుతాయి" అని మాట విసిరాడు. ఆ మాటకి పెట్రోవిచ్ పకాలున నవ్వాడు. అతనితోబాటు అతిథులు కూడా నవ్వారు. వేటగాడిమాట వాళ్ళకికూడా వర్తిస్తుందని చాలామంది లోలోపల బాధపడకపోలేదు. దుబ్రోవ్ ఆ మాటకి చిన్నబోయాడు; అయితే మరేమీ అనకుండా ఊరుకున్నాడు.

ఇంతలో కొత్తగా పుట్టిన కొన్ని కుక్కపిల్లల్ని గంపతో పెట్రోవిచ్ దగ్గిరికి తీసుకువచ్చారు. పెట్రోవిచ్ వాటిని చూడడంలో నిమగ్నుడై వుండగా దుబ్రోవ్ చల్లగా ఎవరూ చూడకుండా మాయమయ్యాడు.

కుక్కల మందిరం నుంచి తిరిగి అతిథులతో ఆ రాత్రి భోజనానికి పెట్రోవిచ్ తిరిగి రాగానే ముందు దుబ్రోవ్ అక్కడ లేకపోవడం చూసి ఎక్కడికి వెళ్ళాడని అందర్నీ అడిగాడు. ఇంటికి వెళ్ళిపోయాడని నౌకర్లు చెప్పారు. వెళ్ళి, వెం

టనే తీసుకు రావలసిందని నౌకర్లను పంపారు. పెత్రోవిచ్ ఎప్పుడూ దుబ్రోవ్ లేకుండా వేటకి వెళ్లేవాడుకాడు. ఎందు కంటే వేటకుక్కలు జంతువుల్ని ఎలా పసిగట్టి చూస్తాయో తెలుసుకోవడంలో దుబ్రోవు అందెవేసిన చెయ్యి. వేట విష యంలో అతని అంచనాలు ఎప్పుడూ తప్పిపోలేదు. దుబ్రోవు కోసం పరిగెత్తిన నౌకరు తిరిగి వచ్చి అతను తన మాట విని పించుకోలేదని, తిరిగి యిక్కడికి రావడానికి ఇష్టపడ్డంలేదని చెప్పాడు. తాగివున్న పెత్రోవిచ్‌కి ఈ మాటలు వినగానే చరుగ్గిన కోపం వచ్చి, మళ్లీ నౌకర్ని పంపిస్తూ దుబ్రోవును వెంటనే తిరిగి వచ్చి ఆ రాత్రంతా తనతో పొక్రొవుస్కో యలో గడపవలసిందనీ అలా చెయ్యకపోతే అతనిని తను మరి క్షమించననీ చెప్పాడు. మళ్లీ ఆ నౌకరు పరుగెత్తి దుబ్రోవు దగ్గిరికి వెళ్లాడు. పెత్రోవిచ్ అతిథుల్ని సాగనంపి నిద్రపోయాడు.

తెల్లవారి లేవగానే అతనడిగిన మొదటి ప్రశ్న "దుబ్రోవు యిక్కడే వున్నాడా?" అని; జవాబుకి బదులు నౌకరు పెత్రోవిచ్‌కి ఒక మడతపెట్టిన చీటీ అందించాడు. అతను దాన్ని గుమస్తాకిచ్చి చదవమన్నాడు. గుమస్తా ఇలా చదివాడు.

మహాశయా,

మీ కుక్కల వేటగాడిని క్షమాపణ కోరడానికిగాను నా దగ్గరికి మీరు పంపించనంత వరకూ మీ పొక్రోవుస్కో య్‌కి వచ్చే ఉద్దేశ్యం నాకులేదు. అతనిని క్షమించడమో లేక తగిన విధంగా శిక్షించడమో నేనే చూసుకుంటాను.

మీ నౌకర్ల చేత అవమానింప బడవలసిన అవుసరం నాకు లేదు. నిజానికి మీరు స్వయంగా ఎగతాళి చేసినా నేను సహించను. నేను మీ అనుచరుణ్ణి కాను, ఒక సాంప్రదాయం గల కుటుంబంలో పుట్టి పెరిగినవాణ్ణి.

ఇట్లు విధేయుడు

ఆంద్రియా దుబ్రోవుస్కీ

. ఈకాలపు సభ్యతలతో పోల్చిచూస్తే ఈ ఉత్తరం అసభ్యతగానే వుంటుంది ఉత్తరంలో వాడిన మాటలు, వ్రాసిన ధోరణికి, పెట్రోవిచ్ మండిపడ్డాడు. మంచంమీద నుంచి నేలమీదికి ఒక్క ఎగురెగిరి గర్జించాడు:

'ఏమిటేమిటి? క్షమాపణ కోరడానికి నా నౌకర్ని అతని దగ్గరికి నేను పంపాలా? క్షమించడమో శిక్షించడమో అతనే చూసుకుంటాడా? ఏమిటతని ఉద్దేశ్యం? ఎవరితో వ్యవహరించేదీ అతనికి తెలుసా? సరే! చెప్తాను. తను గుర్తించేటట్టు చేస్తాను. పెట్రోవిచ్ తో కత్తులు దుయ్యడమంటే అర్థమేమిటో తనే తెలుసుకుంటాడు!'

పెట్రోవిచ్ దుస్తులు వేసుకొని, పరివారంతో వేటకు బయల్దేరి వెళ్ళాడు; కాని వేట ఫలించలేదు. రోజంతా వేటాడితే ఒక్క కుందేలు మాత్రం కనిపించింది. ఆఖరికి అది కూడా తప్పించుకొని పోయింది. అక్కడ ఏర్పాటుచేసిన విందుకూడా అలాగే తగలబడింది. పెట్రోవిచ్ కి ఏ వంటకాలూ రుచించక పోవడంవల్ల వంటవాడి వీపు చిట్లగొట్టి అతిథులందర్నీ తిట్టిపోశాడు.

ఇలా చాలా రోజులు గడిచాయి. వీళ్లిద్దరి మధ్య ద్వేషం మాత్రిం తగ్గలేదు. డుబ్రోవ్కు మరి పెట్రోవిచ్ దగ్గరికి వెళ్ళలేదు. అందుమీద పెట్రోవిచ్ మరింత మండిపడి అతిథుల ముందు డుబ్రోవ్కు గురించి చాలా నీచంగా మాటాడాడు. అతడన్న దానికి మరికొన్ని చిలవలూ పలవలూ పెంచి ఆ పెద్ద మనుషులాడుకున్న గుసగుసలు డుబ్రోవ్కు చెవిలో పడ్డాయి. దీనికితోడు ఇతిరొక సంఘటన జరిగింది. దానితో వీళ్లిద్దరికీ సంధి జరగడం మరి పట్టిదనిపించింది.

ఒక రోజున డుబ్రోవ్కు తన భూములగుండా బగ్గీలో వెళ్తుండగా ఒక చింతచెట్టును గొడ్డలితో ఎవరో నరికినట్లు మరునిముషంలో ఆ చెట్టు పడిపోయినట్లు శబ్దం వినిపించింది. వెంటనే బండిని ఆ చెట్టు దగ్గరికి పోనిచ్చాడు. పొక్రోవ్స్కోయి గ్రామ రైతులు కొందరు ఇక్కడికి వచ్చి దొంగతనంగా ఇతని చెట్ల కలపని తీసుకుపోడానికి వచ్చారు. డుబ్రోవ్కు కనిపించగానే వాళ్ళు పారిపోయారు. వెంటనే బండివాళ్ళ సాయంతో డుబ్రోవ్కు వాళ్ళని పట్టుకొని ఇంటిముందుకు తీసుకువచ్చి రెక్కలు విరిచి కట్టేశాడు. వాళ్ల మూడు గుర్రాల్నికూడా స్వాధీనం చేసుకున్నారు. డుబ్రోవ్కు వాళ్ళ మీద మండి పడ్డాడు. ఇంతకు ముందెప్పుడూ పెట్రోవిచ్ తాలూకు మనుష్యులు తన భూముల్లో అడుగుపెట్టడానికి సాహసించలేదు. వాళ్లు పేరుమోసిన దొంగలైనప్పటికీ, డుబ్రోవ్కుకీ వాళ్ళ యజమానికీ అంతవరకూ వున్న స్నేహం బాగా తెలుసుకాబట్టి ఈ పని చెయ్యలేదు. ఇప్పుడు వాళ్ళ స్నేహం చెడింది కాబట్టి ఆ అదును కనిపెట్టి ఈ పని చేశారు వాళ్ళు

దొంగిలించడానికి పూనుకున్న ఆ చింతచెట్టు రున్యాలతోనే డుబ్రోవు వాళ్ళని శిక్షించాడు. వాళ్ల గుర్రాల్ని తన సొంత గుర్రాలుగా చేసుకొని వాటిచేత పని చేయించాడు.

ఈ వార్త ఆ రోజే పెట్రోవిచ్ చెవిలో పడింది. మండిపడి డుబ్రోవు భూముల్ని స్వాధీనం చేసుకోవాలను కున్నాడు. తన నౌకర్లతో బయలు దేరి వెంటనే డుబ్రోవును బంధించి తన భవనంలో ఖైదీగా ఉంచెయ్యా లనుకున్నాడు. అటువంటి పనిలో అలవాటులేకపోవడం ఏదీ లేదు. కాని వెంటనే అతని ఆలోచనలు మరోదారిపట్టాయి. చిరాకుతో తన భవనంలో ఇటూఅటూ పచారుచేస్తుండగా కిటికీలోంచి చూసేసరికి బయట ఒక బండి గేటుదగ్గరకువచ్చి ఆగింది. బండిలోంచి ఒక పొట్టి మనిషి దిగి ఆ భవనం దివాను ఉండే భాగంవేపు నడిచి వెళ్ళాడు. తలకు ఒక తోలుటోపీ గల్లామూదిరిది, వుంది. వూలుకోటు వేసుకున్నాడు. పెట్రో విచ్‌కి అతనని తెలుసు. అతని పేరు 'షెబాష్కిన్' ప్లీడరు. అతన్ని రమ్మని కబురుపెట్టగానే షెబాష్కిన్ వచ్చి పెట్రో విచ్ ముందు నిలబడి వంగి వంగి సలాములు చేసి అతనేం చెపుతాడో అని ఎదురుచూస్తున్నాడు.

"నీ పేరు ఏమిటో మరిచాను...ఆఁ...ఏం పనిమీద వచ్చావు ఇక్కడికి? అని పెట్రోవిచ్ అడిగారు.

'ఊళ్లోకి వెళ్తూ ఇలావచ్చాను ఇలా ఓసారి తమదివాను గారిని కలుసుకొని శిరసావహించవలసిన .తమ ఆజ్ఞలేవైనా ఉన్నాయేమో తెలుసుకుందామని వచ్చానండి'. అని విన యంగా షెబాష్కిన్ విన్నవించుకున్నాడు.

'నీ పేరేమిటోగాని, మంచిసమయానికే వచ్చావు. నీ అవసరం నాకు కొంత వుంది. వోడ్కా పుచ్చుకొని నేను చెప్పేది విను' అంత ప్రేమగా తనని ఆదరించడం షెబా షిర్కిన్‌కి ఎంతో ఆశ్చర్యం ఆనందం కలిగించింది. వోడ్కా మాత్రం పుచ్చుకోలేదు. పెట్రోవిచ్ చెప్పేదంతా శ్రద్ధగా వినడం మొదలుపెట్టాడు.

పొరుగూళ్లో ఒక తలతిరుగుడు మనిషి వున్నాడు వాడికో చిన్న ఎస్టేటు వుంది. అది నేను స్వాధీనం చేసుకోవాలనుకుంటున్నాను. దానికేం చెపుతావ్?''

"అందుకు సంబంధించిన కాగితాలేమైనా తమవద్ద వుంటే..."

"కాగితాలంటూ ఏమీలేవు తమ్ముడూ! అవుంటే ఇదంతా ఎందుకులే! విషయం యేమిటంటే, న్యాయమైన హక్కులేవీ లేకుండానే వాడి ఎస్టేటు మన పరం చేసుకోవాలి. మొదట్లో ఆ ఎస్టేటు మాకు చెందినదేగాని తర్వాత మా పూర్వులెవరో దాన్ని దుబ్రోవుస్కీ తండ్రికి అమ్మేశారు. దీన్ని ఆధారం చేసుకొని ఏదైనా అల్లలేవూ!"

"చాలా కష్టం...వ్యవహారరీత్యా ఎస్టేటు అమ్మకం, పద్ధతి ప్రకారం బాగానే జరిగిందండి..."

"కొంచెం ఆలోచించు భాయ్. ఆలోచించి ఏదైనా మార్గం చూడు..."

"తమరు అతని దగ్గరున్న ఆ ఎస్టేటు తాలూకు దస్తావేజులు తెప్పించ గలిగితే...కొంత వరకు..."

'వచ్చిన చిక్కేమిటంటే ఆ దస్తావేజులు అగ్ని ప్రమాదంలో కాలిపోయాయట...'

'ఏమన్నారు? అతని దస్తావేజులు కాలిపోయాయా! అయితే ఇంతకన్నా మనకి కావలసిందేముంది? మనం న్యాయ చట్టం ప్రకారమే నిలబడి, నిస్సందేహంగా అతని ఆస్తి దక్కించుకోవచ్చును...'

'అలాగానా? అయితే నీమాటమీదే నిలబడతాను. జ్ఞాపకం వుంచుకో. నీ ఉపకారానికి తగిన బహుమతి ఇస్తాన్లే"

సెబాష్కిన్ నేలదాకావంగి సలాంచేసి సెలవు తీసుకుని వెళ్లిపోయాడు. ఆ రోజు మొదలు అతను అందుకోసం పన్నుగడలు పన్నడం మొదలుపెట్టాడు. సరిగ్గా రెండు వారాలు దాటాక డుబ్రోవుకి ప్రక్కనున్న పట్టణంలోని అధికారుల నుంచి ఒక వర్తమానం వచ్చింది-'కిస్టెనెవకా' అనబడే, అతని ఎస్టేటు వివరాలున్నూ, ఆ ఎస్టేటు డుబ్రోవుకి ఎలా సంక్రమించిందో తెలిపే సరైన నిదర్శనాలున్నూ తెలియపర్చవలసిందని అధికారుల హుకూం.

తలవని తలంపుగా వచ్చిన ఈ విచారణకి డుబ్రోవు చాలా ఆశ్చర్యపడ్డాడు. కోపంతో మండిపడి ఆరోజే పెడసరంగా జవాబు వ్రాశాడు. 'కిస్టెనెవకా' అనే తన ఎస్టేటు తనకి తండ్రి తదనంతరం వచ్చిందనీ, వారసత్వపు హక్కు చేత ఆ ఎస్టేటు తన దయిందనీ, అది ట్రోయెకురోవ్ కుటుంబం జోక్యం చేసుకోవలసిన వ్యవహారం కాదనీ. తన ఆస్తి మీద ఇంకెవరికైనా హక్కు వుందని ప్రయత్నించడం

పిటూకీ లేవనీయడానికీ; తనని మోసం చెయ్యడానికేననీ స్పష్టంగా సమాధానం పంపేడు.

ఈ ఉత్తరం సెబాష్కిన్‌కి చాలా ఆనందం కలిగించింది. అది తన పన్నాగానికి సరిపోయేటట్టు వుంది. ఉత్తరాన్ని బట్టి దుబ్రోవ్‌స్కీ వ్యవహారరీతి తెలియనివాడనీ, అటువంటి పెడసర స్వభావం గలవాడిని సులభంగా మోసగించవచ్చునే, అనుకున్నాడు. తీరా దుబ్రోవ్‌స్కీ యిచ్చిన జవాబు మరోమారు నెమ్మదిగా చదువుకున్నాక ఈ వ్యవహారం అనుకున్నంత తేలికైనది కాదని తెలుసుకున్నాడు. కొంచెం జాగ్రత్తగా వ్యవహార సరళిలో సమాధానం యివ్వవలసి వుంటుందని అవగతం చేసుకున్నాడు. కాని అతను సంజాయిషీ చాలదనిపించింది.

తనకి న్యాయమైన హక్కు వుంది కనక తనను ఎవరూ కదపలేరని దుబ్రోవ్‌స్కీ ధీమాగా వున్నాడు. ధీమాపడి యీ కేసువల్ల అట్టే చికాకు పడలేదు. కేసు గెలవడానికి ఇష్టానుసారం డబ్బు వెదజల్ల వలసిన అవసరమూ లేదు. వున్నా అతనిదగ్గ డబ్బూలేదు. డబ్బుఉన్నా లంచగొండి ఉద్యోగుల్ని మేపడం అతని కిష్టమూలేదు. అయితే తను యింతటి విపరీతవిపత్కర పరిస్థితుల్లో చిక్కుకోవలసి వస్తుందని దుబ్రోవ్‌స్కీ ఎన్నడూ అనుకోలేదు పాపం! పెట్రోవిచ్ మాత్రం ఎత్తుకు పై ఎత్తు వేస్తున్నాడు. అతని లాయరు నక్కజిత్తుల వాడు. వకాల్తా పుచ్చుకున్నప్పట్నుంచీ లంచాలు మేపుతూ బెదిరిస్తూ న్యాయచట్టాలకు వక్రభాష్యాలు చెబుతూ దబా

యిస్తూ ఎలాగైనా కేసు గెలిపించాలని నానా తంటాలూ పడుతున్నాడు.

ఇలావుండగా తీర్పు దగ్గరపడింది. ఒకరోజున అధికార్ల వద్దనుండి దుబ్రోవుస్కీకి ఒక తాఖీదు వచ్చింది. మేజస్ట్రేటు ఎదట హాజరై సేనాని పెట్రోవిచ్‌కీ తనకీ మధ్య ఏర్పడ్డ తగాదాను పరిష్కరించుకోవలసిందనీ మేజస్ట్రేటు చెప్పే తీర్పుకు బద్ధుడైవుంటాడో వుండడో తెలపవలసిందనీ ఆ తాఖీదులో స్పష్టంగా పేర్కొనబడింది. తాఖీదు అందుకుని దుబ్రోవు పట్నానికి బయలుదేరాడు. దారిలో పెట్రోవిచ్ తారసిల్లాడు. ఒకరి నొకరు ద్వేషంగా చూసుకున్నారు. పెట్రోవిచ్ ఒకసారి విషపునవ్వునవ్వాడు. అతని నవ్వును చూసి దుబ్రోవుస్కీ తుళుక్కుపడ్డాడు.

## 2

పట్టణంలో తన స్నేహితుడైన ఒక వర్తకుడి యింట్లో దుబ్రోవు బసచేసి ఆ మర్నాడు ఉదయం మేజస్ట్రేటు యెదుట హాజరయ్యాడు. అతనిని ఎవరూ లక్ష్యపెట్టలేదు. పెట్రోవిచ్ రాగానే గుమస్తాలు లేచి నిలబడ్డారు. కలాలుతీసి చెవుల సందులో పెట్టుకున్నారు. కోర్టులోవుండే సభ్యులంతా అతనికి స్వాగతం చెప్పి అతని దర్జాకు హోదాకు తగ్గట్టుగా ఒక సోఫా చూపించారు. ద్వారం సమీపంలో పెట్రోవిచ్ హుందాగా కూర్చున్నాడు, దుబ్రోవు గోడకు ఆనుకుని నిలబడ్డాడు. న్యాయాధిపతుల తీర్పు చదవడం మొదలు కాగానే

కోర్టంతా నిశ్శబ్దమైపోయింది. సెక్రటరీ ఉపన్యాస ధోరణిలో తీర్మానం చదివి వినిపించాడు. పెట్రోవిచ్ వంశస్థులు అనాదిగా "క్రిస్టెన్‌వకా" ఎస్టేటుకు సంపూర్ణ హక్కుదారులని నిశ్చయమయింది. ఆ తీర్పు అక్కడవున్న వారంతా ఆమోదించి సంతకాలు చేశారు. సెక్రటరీ కూర్చోగానే సెభాష్కిను లేచి పెట్రోవిచ్‌కి నమస్కరించి దస్తావేజులమీద సంతకం చెయ్యవలసిందిగా ప్రార్థించాడు. గెలుచుకున్న పెట్రోవిచ్ కలంతీసి దస్తావేజులమీద సంతకం చేశాడు!

తర్వాత వంతు డుబ్రోవుస్కీది. సెక్రటరీ దస్తావేజులు అతని దగ్గరికి తీసుకువచ్చాడు. తలవంచుకుని డుబ్రోవు కదలకుండా నిలబడ్డాడు. సెక్రటరీ మళ్లీ డుబ్రోవును ఆ తీర్పు తనకు సంతృప్తిగా వుందనో లేక అసంతృప్తిగా వుందనో దస్తావేజులమీద సంతకం చెయ్యమని అడిగాడు. ఒకవేళ ఆ తీర్పు తను అనుకున్నదానికి విరుద్ధంగా ఉందనుకుంటే, పై అధికార్లకు మనవి చేసుకునే హక్కుందనీ, అలా చెయ్యాలనుకుంటే, చట్టప్రకారం గడువులోపల అలా చెయ్యవచ్చని కూడా చెప్పాడు.

డుబ్రోవు ఏమీ మాటాడలేదు. హఠాత్తుగా తల యెత్తాడు. కళ్లు మెరిశాయి. ఒక్కసారి పాదాలు నేల కదిమి గుద్ది, సెక్రటరీని ఒక్కతోపు తోసేసరికి అతను క్రిందపడ్డాడు. తర్వాత సిరాబుడ్డి తీసి మేజస్ట్రేటు ముఖానికి గిరవాటేశాడు. అందరూ నివ్వెరపోయారు. డుబ్రోవు హంగామా చేస్తూ, "ఏమిటీ! దేవాలయంలాంటి ఈ పవిత్రస్థలాన్ని అపవిత్రం చేస్తారా! ఏం పాడు కాలం! ఎప్పుడన్నా ఇలాంటిదివిన్నారా?"

జమీందారు వైపు తిరిగి "ఇటువంటి పుణ్యస్థలంలోకి వేటగాళ్ళు కుక్కల్ని తీసుకురావడం ఎక్కడన్నా ఉందా... కుక్కలు కోర్టంతా కలియతిరుగుతున్నాయి. ఉండు నీకు బుద్ధి చెప్తాను. అంటూండగా కావలివాళ్ళు ఈ మాటలు విని కోర్టులోకి గబగబా వచ్చి అతికష్టంమీద దుబ్రోవును పట్టుకుని బయటకి తీసుకుపోయారు. పెత్రోవిచ్ అందరితోనూ బయటికి వెళ్ళాడు. అకస్మాత్తుగా దుబ్రోవు పిచ్చెత్తినట్లు అవడం, పెత్రోవిచ్ అవమానపడ్డాడు. అందుచేత కేసులో గెలిచిన ఆనందంకాస్తా పోయింది.

పెట్రోవిచ్ కి అనుకూలంగా తీర్పు చెప్పినందుకు న్యాయాధికారుల్ని కనీసం మెచ్చుకోనైనా మెచ్చుకోలేదు. వెంటనే పొక్రోవుస్కోయ్ కి వెళ్ళిపోయాడు. దుబ్రోవుస్కీ జ్వరంతో మంచమెక్కాడు. అదృష్టవశాత్తూ అతనికి వైద్యం చేస్తున్న వైద్యుడు బొత్తిగా దద్దమ్మకాదు. జలగలతోటీ, స్పాయిను ఈగలతోటే చికిత్సచేసి; రక్తంతీసి వైద్యం చేశాడు. రోగికి సాయంత్రానికల్లా స్మారకం వచ్చింది. ఆ మర్నాడు దుబ్రోవును తన స్వగ్రామమైన 'కిస్టెనెవకా'కు తీసుకువెళ్ళాడు.

## 3

రోజులు గడిచాయి; కాని దుబ్రోవు జబ్బు నయం కాలేదు. తిరిగి ఉన్మాదం రాలేదు కాని శక్తులన్నీ తగ్గిపోయాయి. పాత అలవాట్లన్నీ పూర్తిగా వదిలేశాడు. తన

గదిలోంచి ఎప్పుడో కాని బయటికి వచ్చేవాడే కాదు. రోజుల కొద్దీ ఏదో ఆలోచిస్తూ అలా ఉండిపోయేవాడు. చిన్నప్పుడు డుబ్రోవు కొడుకుని సంరక్షణ చేసినదాది "యెగొరోవ్నా" చాలా మంచిది. డుబ్రోవును ఒక చంటిబాబుగా చూస్తూ, భోజనాల వేళప్పుడూ నిద్రవేళప్పుడూ జ్ఞాపకం చేసేది, తినిపించి, నిద్రపుచ్చేది. అతను యెగొరోవ్నా చెప్పినట్లల్లా చేసేవాడు. మరెవ్వరితోనూ మాటాడేవాడుకాదు డుబ్రోవు ఎస్టేటు వ్యవహారాల గురించి స్థిమితంగా ఆలోచించే పరిస్థితిలోగాని పనులుచేయించే స్థితిలోగాని లేనందువల్ల డుబ్రోవు కొడుకుని యెగొరోవ్నా పిలిపించాలనుకుంది. అప్పుడు డుబ్రోవు కొడుకైన "వ్లాడిమర్", అప్పటికి పీటర్సు బర్గులోవున్న సిపాయిలపటాలంలో పని చేస్తున్నాడు. యెగొరోవ్నాకి చదువురాదు. వంటమనిషి హారిటన్ తప్ప ఆ కిస్టెనెవ్కా ఊరు మొత్తంలో ఇంకెవరూ చదుకున్నవాళ్ళు లేరు. అందుచేత యెగొరోవ్నా పద్దులపుస్తకంలోంచి ఒక కాగితం తీసి హారిటనుకిచ్చి సంగతులు చెప్పి ఉత్తరం రాయించి ఆరోజే పోష్టు చేయించింది.

మీకు ముందుగా ఈ కథకి ముఖ్యకథానాయకుడిని పరిచయుం చెయ్యవలసిన సమయం వచ్చింది.

వ్లాడిమర్ మొదట సైనికపాఠశాలలో చదివి పెరిగాడు. అక్కడ పెద్ద పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాక ఒక దళానికి అధికారి అయ్యాడు. తండ్రి తన సుఖాల గురించి ఆలోచించడంలో విసుక్కోలేదు. తను అనుకున్న దానికంటే తండ్రి ఎక్కువ సొమ్మే పంపేవాడు. వ్లాడిమర్ విస్తారంగా ఖర్చు

పెట్టేవాడు. జల్లాలు మరిగేవాడు. అనేకమైన అలవాట్లతో విచ్చలవిడిగా ఖర్చుచేసి, జూదం ఆడి, ఆఖరికి అప్పులు కూడా చేశాడు. ఎప్పుడో ఒకప్పుడు గొప్ప ఆస్తిపరురాలైన భార్య రాకపోతుందా అని అతని ధీమా... చిన్నప్పుడు కొందరు ఇటువంటి తెలివితక్కువ కలలేకంటుంటారు!

ఒకరోజు సాయంకాలం, తన గదిలో చాలామంది ఉద్యోగస్తులు సోఫాల్లో కూర్చుని హుక్కా పీలుస్తూ వుండగా వ్లాడిమర్ సేవకుడు, "గ్రిషా", వచ్చి ఒక ఉత్తరం అతని కందించాడు. ఉత్తరం వున్న కవరుమీద దస్తూరీ, పోస్టు ముద్రలు చూడగానే వ్లాడిమర్ గబగబా ఆ కవరు చించి ఉత్తరం చదివాడు:

"చిన్నబాబుగారైన వ్లాడీమర్ బాబుకి మీ దాది వ్రాయడం యేమంటే మీ నాన్నగారి ఆరోగ్యం ఏమీ బాగులేదు. అతని పరిస్థితి భయంగావుంది. అప్పుడప్పుడు వంటిమీద తెలివిలేకుండా ఏమిటేమిటో మాటాడుతుంటారు. పగలంతా చిన్నపిల్లాడిలాగా అలాగే కూర్చుండిపోతారు. కాని చావూ బ్రతుకూ అనేవి భగవంతుడి చేతిలో వున్నాయి. కాబట్టి మీరు బయలుదేరి రావలెను మీ కోసం గుర్రాల్ని పెసాకోన్నెయ్ వద్దకి పంపిస్తాము. మన ఎస్టేటంతా ట్రో విచ్‌కి కోర్టువారు అప్పగిస్తారనీ, మేమంతా అతని నౌకర్లమౌతామని అంటున్నారు. మే మెప్పుడూ మీ నౌకర్లగానే వుంటున్నాం, గాని ఇంతవరకూ అటువంటి సంగతే మాకు తెలీదు. మీరు పీటర్సుబర్గులో వుంటున్నారు కాబట్టి 'జార్'

తో మాట్లాడితే సరి, మాకిలాంటి అన్యాయం జరిగితే అతను ఊరుకోరు చిత్తగించవలెను.

ఇట్లు
మీ దాది
ఒరినా మొగొరోవ్నా బిజిరెవా"

'అక్కడ మీ సేవకుడు గ్రిషా బాగున్నాడా... గ్రిషాకి నా ఆశీర్వాదములు. ఇక్కడ వారంరోజుల్నుంచి వర్షం పడుతుంది. మన పశువులు తోలే రోడ్యా మొన్న సెయింటు నికొలాస్ పండుగరోజున చచ్చిపోయాడు'.

అల్లిబిల్లిగా రాసిన కొన్ని పంక్తులు మళ్లీ మళ్లీ ఎంతో ఆత్రుతగా చదివాడు. పాపం వ్లాడిమర్ చంటిపిల్లాడుగా ఉన్నప్పుడే తల్లిపోయింది. ఎనిమిదేళ్ళప్పుడే వ్లాడిమర్ని ఈ పీటర్సుబర్గుకి పంపారు. తండ్రినికూడా సమంగా తెలీదు. అందుకే తండ్రి అంటే వ్లాడిమర్ ఎంతో ఉబలాటపడతాడు. అంతా కలిసివుండి ఒకచోట జీవించడమంటే అతనికి చాలా ఇష్టం. మరి చిన్నప్పుడు అందరూ ఒకచోటవుండి ఆనందించే సరదాలేవీ అతనికి లేకుండా పోయాయి.

తండ్రికూడా తనకు దక్కకుండా పోతాడేమోనని అతనికి చాలా దుఃఖంవచ్చింది. దాది రాసిన ఉత్తరాన్ని బట్టి దురదృష్టవంతుడైన తండ్రి పరిస్థితి తలంపుకు వచ్చి చాలా భయం వేసింది. నిస్సహాయుడైన తండ్రి తన కళ్ళ ముందు కనిపించినట్లయింది. ఒక మారుమూల పల్లెటూరిలో ఏదిక్కూ లేకుండా ఒంటరిగా పడున్నతండ్రి – తెలివితక్కువదైన ఒక ముసలిదాది సంరక్షణ-పనికిమాలిన నౌకర్లు-ఆపద

రాబోతున్నదనే బెదరింపు భయం ఒకప్రక్క, శరీర పరిస్థితి బాగులేక పోవడమేగాక, మనసు స్తిమితంగా ఉండిపోవడం. ఏ దిక్కూ లేక ఈ బాధలతో భయాలతో ... వడం–అబ్బ! ఎంత దారుణంగా వుంది తండ్రి దుస్థితి! తను తండ్రి విషయమై ఇంత నిర్లక్ష్యంగా అశ్రద్ధగా ఉన్నందుకు తన నేరానికి తనని తనే నిందించుకున్నాడు. తండ్రి దగ్గర నించి ఎంతకాలం నించో ఉత్తరాలు రాకపోయినా, అతని గురించి తెలుసుకోడానికైనా తను ప్రయత్నించలేదు. ఏ ఎస్టేటు వ్యవహారాలలోనో, ఏ వేట సందడిలోనో ఉండి వుంటారనిమాత్రం అనుకున్నాడు. కాని ఇలా జరిగిందని అనుకోలేదు.

ఇంటికి వెళ్లాలని నిశ్చయం చేసుకున్నాడు. ఒకవేళ తండ్రి ఆరోగ్యం బాగులేకపోయి, తనక్కడ ఉండిపోవలసి వస్తే ఈ ఉద్యోగం కూడా విడిచిపెట్టడానికి సిద్ధమయ్యాడు. గదిలోవున్న స్నేహితులు వ్లాడిమర్ ఏదో చికాకులో వున్నాడని, అక్కడనించి వెళ్లిపోయారు. ఒంటరిగాఉన్న వ్లాడిమర్ సెలవుకోసం అర్జీ వ్రాసి, సిగరెట్ వెలిగించి, ఆలోచనలో మునిగిపోయాడు.

ఆరోజే సెలవుపెట్టి మూడురోజుల తర్వాత బయలు దేరాడు. అలా బయలుదేరి పెసాకోన్యె అనే వూరు వచ్చాడు. క్రిస్టెనెవకా దగ్గర పడిందనేసరికి వ్లాడిమర్‌కిఆత్రుత ఎక్కువయింది. గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. తన తండ్రి ఇంకా బ్రతికివుండడేమో అనే భయంకలిగింది. ... దరూ ఏడుస్తున్నట్టు; ఆ వూరంతా విచారంలో మునిగి

దృష్టం అనిపించింది. తనక్కడికి వెళితే ఒంటరితనం, దరి ద్రం, ఎన్నో బాధ్యతలు అన్నీ తనమీద పడతాయను కున్నాడు. తనకి తెలీని ఇంకా ఎన్ని బాధ్యతలు తన నెత్తిన పడతాయో ఎవరికి తెలుసును!

వ్లాదిమరు పెసాకోన్కాయ్ చేరాక అక్కడ తనకోసం గుర్రాలు వచ్చి వున్నాయేమో అని అక్కడి యజమానిని అడిగాడు. వ్లాదిమరు పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకున్నాక ఆ యజమాని కిస్టెనవకా నుంచి గుర్రాలు వచ్చి నాలుగు రోజుల నుంచి అక్కడే ఉన్నాయని చెప్పాడు. అంతలోనే తమ పాత బండివాడు ఆంటన్ వచ్చాడు. చిన్నప్పుడు ఈ ఆంటన్ తనని గుర్రాలశాలలోకి తీసుకువెళ్ళి అన్నీ చూపిం చేవాడు. తన చిట్టి గుర్రాన్నికూడా ఆంటనే పెంచేవాడు. వ్లాదిమర్ని చూడగానే ఆంటన్‌కి కళ్ళనీళ్ళు తిరిగాయి. నేలాదాకావంగి సలాం చేశాడు. తన తండ్రి ఇంకా బ్రతికే ఉన్నాడని చెప్పి గుర్రాన్ని సిద్ధంచేశాడు. అక్కడ భోజనం చేయమన్నా వ్లాదిమరు చెయ్యలేదు. సరాసరి గుర్రాల బగ్గీలో కూర్చుని వేగం పోనిమ్మన్నాడు. ఆంటన్ బండి ఇరుకు దారులుగుండా పోనిచ్చాడు. త్రోవలో ఇద్దరూ ఇలా మాటాడుకున్నారు:

'ఆంటను! మా నాన్నగారికీ, పెట్రోవిచ్‌కీ ఏదో కోర్టులో తగాదా జరిగిందట? నీ కేమన్నా తెలుసా?'

"పరమేశుడికి తెలవాలిబాబూ! ఊళ్లో అనుకోడమే టంటే మన బాబుగారు పెట్రోవిచ్ దొరతో తగూ తెచ్చు కున్నాడట. దానిమీదపెట్రోవిచ్, బాబుగారిమీద కోర్టులో

దావా పడేసినారట! దావాదాకా యెందుకు ఆ దొరే తీరుప్పు చేసేసినా సెలామనీ అవుద్దికదా! బాబుగారి యిష్టాయిష్టాల్ని మా బంట్రోతులు యేమీ అడక్కూడదు గాని మీ నాన్నగారు ఆ దొరతో పాడుతగువు తెచ్చుకోకుండా వుంటే బాగుండిపొయ్యేది. ముల్లెల్లి అరిటాకుమీద పడినా అరిటాకెల్లి ముల్లుమీదపడ్డా ఒకటేగదా బాబూ!"

'అంటే పెట్రోవిచ్ తన యిష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తున్నాడన్నమాట?'

"అవును బాబూ! మేజస్ట్రేటునికూడా లెక్కచెయ్యడంటారు. పై పెచ్చు ఆళ్లేవొచ్చి దొర చెప్పిన పనులన్నీ చేస్తుంటారట! ఊళ్ళో పెద్ద పెద్దోళ్ళంతా ఆ దొరని దరిసించుకు పోతారట! అవును బాబూ! బెల్లమున్నకాడే సీమలు సేరతాయి గదండి."

'మన కెస్టెనెవ్కా ఎస్టేటుని అతను తీసుకుంటాడనేది ఎంతవరకూ నిజం?'

'నిజమేనట బాబూ! అలాగే విన్నాం. మొన్న చెర్చిలో స్వామి మా పెద్దతో అన్నాడట, 'మీకు రోజులు దగ్గిరపడ్డాయి–పెట్రోవిచ్ చేతుల్లో పడ్తారు మీరంతా' అనే సరికి మాకమ్మరోడు మికితాలేడూ, ఆడన్నాడట 'ఊరుకో ఊరుకోవయ్యా! యీళ్ళందర్నీ ఎందుకు బెదరగొడతావు. పెట్రోయిచ్ తన మట్టుకు తను యెజమానైతే మాడుబ్రోవు దొర, మేమంతాకూడ ఎవరికాళ్ళమే యజమానులు. దేవుడికీ జారుచక్రవర్తికీ అందరం చెందే వాళ్ళమే' అని సెప్పాడట!

'అయితే పెట్రోవిచ్ మీకు యజమాని కావడం ఇష్టంలేదా?'

'పెట్రోయిచ్చా? దేవుడు మేలుసేసి అలా జరక్కూడదు గాని—ఆ దొర సాకర్లే నానా పాట్లూ పడతన్నారు. ఇంక కొత్తోళ్ళని అడగాలా? ఆళ్ళ సెరమాలు ఒలిచి ఎముకలు సూర్ణం సేస్తుంటాడట! ఒద్దు బాబూ ఒద్దు. అయ్యగారికి యోగికం నయమైతే అంతేసాలు. మీరు తప్ప మాకింకెవ్వరూ ఒద్దు. మమ్మల్ని యిడిసిపెట్టకండి. మీ పాదాల కాడ పడుంటాం' అంటూ ఆంటన్ కళ్లెంలాగి కొరడాతో గుర్రాల్ని అదిలించాడు. దాంతో గుర్రాలు పరుగు పుచ్చుకున్నాయి

బండివాడి విశ్వాసానికి లోలోపల సంతోషిస్తూ. వ్లాడిమరు ఆలోచనల్లో మునిగిపోయాడు. ఒకగంటసేపు బండి పోలాక బండి ఒక రోడ్డుమీదికి రాగానే "అదిగో పొక్రోవ్స్కోయ్" అని ఆంటను చెప్పేసరికి వ్లాడిమరు ఉలిక్కిపడి తల యెత్తాడు. వాళ్లు వెళ్తున్నదారి పక్కనుంచి ఒక సెలయేరు ప్రవహిస్తోంది. వంకర వంకరులుగా తిరిగి దూరంగా ఉన్న కొండల్లోకి పారుతోంది. ఆ కొండల్లో ఒక కొండ మీద దట్టంగా వున్న ఎత్తైన చెట్లకొమ్మల పై నుంచి—ఒక రాతి కట్టడం పై భాగంపచ్చగా అవుపిస్తూంది. మరోకొండ మీదఅయిదు గుండ్రని గోపురాలతో ఉన్న చర్చి కనిపిస్తోంది. చుట్టుపక్క లంతా రైతుల గుడిసెలు, బావులు తోటలు వున్నాయి. ఈప్రదేశమంతా వ్లాడిమరుకి బాగ తెలిసున్నదే! ఆ కొండగుట్టమీదే, పెట్రోవిచ్ కూతురు మాషాతో తను

చిన్నప్పుడు ఆడుకున్నరోజులు వ్లాడిమరుకి జ్ఞాపకంవచ్చాయి. మాషా తన కంటే రెండేళ్ళు చిన్నది. అంత చిన్నప్పుడు కూడా మాషా ఎంతో అందంగా వుండేది. మాషా ఎలా వుందని ఆంటన్‌ని అడుగుదామనుకున్నాడు గాని అకస్మాత్తుగా సిగ్గుపడి, అడగలేకపోయాడు.

ఒక యింటిముందునించి బండి వెళ్తుండగా, పెరటి తోటలో మొక్కలమధ్య తెల్లని గౌనువేసుకుని ఎవరో నడవడం కన్పించింది. గాని అ దేసమయంలో ఆంటన్-పట్టణాల్లోనూ పల్లెటూళ్ల లోనూ బళ్ళవాళ్ళకి సహజంగావుండే తల తిరుగుడుతో వంతెనమీద నుంచి గుర్రాల్ని గేలప్ఎత్తించి ఒక్క వూపులో ఆ వూరు దాటించేశాడు. ఆ వూరు దాటాక, చిన్న చిన్న గుట్టలు దాటేసరికి వ్లాడిమర్‌కి చింతచెట్లగుబురు కనిపించింది! ఎడంపక్క బయలులో ఎర్రని పైకప్పుతో ఒక చిన్న ఇల్లు కనిపించింది. వ్లాడిమర్ గుండెలు దడదడకొట్టుకో సాగాయి. క్సెనెవ్కా గ్రామం, తన తండ్రి కుటీరం తన కళ్ళ యెదుట కనిపించాయి.

మరో పదినిమిషాలకి బండి ఇంటిముందే ఆగింది. చుట్టూ ఆతురతగా కలియచూశాడు. పన్నెండేళ్ళ తర్వాత మళ్లీయీ నాటికి ఇంటికి వచ్చాడు. తన చిన్ననాడు నాటిన చింత మొక్కలు ఇప్పుడు పెద్దపెద్ద కొమ్మలతో మహావృక్షా లయిపోయాయి. తన చిన్నప్పుడు ఏ ఆవరణలోనైతే, మధ్య నడవడానికి దారి ఉంచి, ఎనిమిదిపలకల ఆకారంలో మూడు వరుసలుగా పూల మొక్కలునాటి అందంగా వుంచారో ఆ ఆవరణలో ఇప్పుడు ఏ మొక్కలూ లేవు. సరిగదా మైదానంలా

వుంది. అక్కడ ఇక్కడ కొవ్వుకి బందాలున్న ఒక గుర్రం వచ్చిక మేస్తోంది. ఇంటి ముందున్న కుక్కలు పెద్దగా అరవడం మొదలుపెట్టాయి గాని అంటన్ని చూడకానే మొరగడం మాని బొచ్చుతో ఉన్న తోకల్ని ఆడించాయి ఇంటి వాళ్ళు బయటకువచ్చి వ్లాడిమర్ని చూడగానే పట్టరాని సంతోషంతో బండి చుట్టూ మూగారు. అతను అతికష్టంమీద ఆ మూకలోంచి చోటు చేసుకుని బయటపడి మెట్లమీంచి ఇంట్లోకి పరుగెత్తాడు. ఇంటిముంగిట యెగొరోవ్నా కనిపించి అమాంతంగా అతన్ని కౌగిలించుకుని కళ్ళనీళ్ళు పెట్టుకుంది "నాన్నగారెలా వున్నారు? ఎక్కడ వున్నారు? బాగామారి పోయారా?" అంటూ అతను ఆమెను ప్రశ్నించాడు. అతని స్వరం విన్నంతనే లోనుంచి ఒక ముసలాయన యివతలకు వచ్చాడు. అతనెంతో నీరసంగా మూలుగుతున్నాడు. మోము పాలిపోయివుంది. వ్లాడిమర్ని చూసి "వచ్చావా నాయనా!" అని వణుకుతూ ప్రేమతో పలకరించాడు. వ్లాడిమరు తండ్రిని చూసి నిర్ఘాంతపోయి అలాగే నిలుచుండి పోయాడు. కొంతసేపటికి చైతన్యం తెచ్చుకుని అతన్ని కౌగలించుకున్నాడు, కొడుకుని చూసేక డుబ్రోవుస్కీ ఆనందానికి హద్దులు లేవు. తూలుతున్న తండ్రిని కొడుకు పట్టుకుని పడిపోకుండా ఆపాడు.

"మంచం మీంచి ఎందుకులేచారు బాబూ! నించోడానికి ముణుకుల్లో శక్తిలేదు కదా, లేచియెందుకు రావాలి!" అని యెగొరోవ్నా అతన్ని మందలించింది. ముసలాయన్ని ఇద్దరూ పడకగదిలోకి చేర్చారు. డుబ్రోవుస్కీ తన కొడు

కుతో ఏదో మాట్లాడాలని ప్రయత్నించాడు కాని మళ్ళీ అతనికి మతి స్థిమితం తప్పింది. ఒకదాని కొకటి సంబంధం లేని మాటలేవో గొణిగాడు. గొణుగుతూనే అలా నిద్రపోయాడు. తండ్రి దుస్థితిని చూసి కొడుకు ఎంతో బాధపడ్డాడు. తండ్రి గదిలోనే వుంటూ ఆయనకి సేవచేస్తూ రుణంతీర్చుకుంటానని నౌకర్లంతా ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోవాలని వ్లాడిమర్ అనేసరికి అందరూ అక్కడున్నుంచి వెళ్ళిపోయారు.

## 4

నాలుగు రోజులు పోయాక వ్లాడిమర్ తన ఎస్టేటు వ్యవహారాలు ఎలావున్నాయో చూడాలనుకున్నాడు. జరిగిన సంగతులు జరిగినట్టూ చెప్పేస్థితిలో లేడు తండ్రి. ఆఖరికి వకీలునుకూడా పెట్టుకోలేదు. కేసుకు సంబంధించిన కాగితాలను తిరగవేశాడు. కాని మేజస్ట్రేటు పంపిన నోటీసూ దానికి తండ్రి యిచ్చిన సమాధానం తప్పితే మరొక కాగితంఅంటూ ఒకటీలేదు. అందువల్ల కేసు ఎలా నడిచిందో వాద ప్రతివాదలేమిటో సరిగ్గా అతనికి అవగాహనకా లేదు. ఎంతకీ ఒక నిర్ణయానికి రాలేకపోయాడు. ఏంచేయాలో తోచిందికాదు.

తండ్రి ఆరోగ్యం రానురాను మరీ విషమించిపోయింది. అశ్రద్ధచేస్తే ఇంకా ముదిరిపోతుందని వ్లాడిమర్ తండ్రి దగ్గరే ఎప్పుడూ కూర్చుని పరిచర్యలు చేస్తున్నాడు. జ్వరంతో తండ్రికి పూర్తిగా ముసలితనం వచ్చేసింది.

ఈ కోర్టు కేసు విషయమై పై అధికార్లకి మనవి చేసుకోడానికి వచ్చిన గడువు కాస్తా దాటిపోయింది. అందుచేత కిస్త్యెనవకా ఎస్టేటు, చట్ట ప్రకారం పూర్తిగా పెట్రోవిచ్ స్వాధీనమైనట్టే. పొట్టివకీలు షబాష్కిన్ వచ్చి పెట్రోవిచ్ దర్శనం చేసుకొని వంగి నమస్కారాలు చేశాడు. ఎస్టేటు ఆ దొరగారికి చెందిందని సంతోషం వెలిబుచ్చాడు. దొరగారు కొత్తగా సంపాదించిన ఆ ఎస్టేటును ఏ రోజున తమ స్వాధీనం చేసుకోవాలని అనుకుంటున్నారో సెలవిమ్మనీ, తామే స్వయంగా బయల్దేర్తారో లేక మరెవరికైనా ఆ అధికారం యిచ్చి పంపించాలనుకుంటున్నారో చెప్పమనీ ప్రార్థించాడు.

పెట్రోవిచ్ ఎందుకోగాని చికాకుగా కనిపించాడు. దురాశవల్ల అతనీపని చెయ్యలేదు. పగతో చేశాడు. తన ద్వేషం తనని చాలా దూరం తీసుకువెళ్ళిందని తన మట్టుకు తనకే తోచి అంతరాత్మ దెబ్బతింది. తన పాత స్నేహితుడు ఇప్పుడు విరోధిగా మారిన దుబ్రోవ్ ఆరోగ్యపరిస్థితి బొత్తిగా చెడిపోయిందని పెట్రోవిచ్‌కి తెలుసు. అందువల్ల తను సంపాదించిన విజయం అతనికి ఆనందాన్నివ్వలేదు. ఈ చికాకు వల్ల పెట్రోవిచ్ క్రూరంగా షబాష్కిన్ వైపు చూశాడు. ఏదైనా నెపంతో అతన్ని కసరివేద్దా మనుకున్నాడు. కాని ఏ నెపం దొరకలేదు.

“వెళ్ళవోయ్... నే నిప్పుడు చాలా ఇతర విషయాలు ఆలోచించాలి అన్నాడు.

పెట్రోవిచ్ సరైన స్థితిలో లేడని తెలుసుకున్న షబాష్కిను, మరి ఆలస్యం చెయ్యకుండా వంగి సలాములుచేసి,

పిలవుప్పుచ్చుకుని, తొందరగా బయటపడ్డాడు. పెట్రోవిచ్ ఈల వేసుకుంటూ పచారు చెయ్యడం మొదలుపెట్టాడు. అతనిమనస్సు చికాకుగా ఉన్నప్పుడు ఇలా పచారు చెయ్యడం, ఈల వేయడం అలవాటు. పెట్రోవిచ్ తన గుర్రపుబగ్గీ సిద్ధంచెయ్యమని నౌకర్లకు ఆజ్ఞాపించాడు. పూలుకోటు వేసుకుని స్వయంగా బయల్దేరాడు.

డుబ్రోవు ఇల్లు సమీపించేసరికి అతని మనసులో రకరకాల అభిప్రాయాలు కలిగాయి. తన అధికారం హోదా నిలబెట్టుకోడానికి చేసిన ప్రయత్నంలో తను గెల్చాననే గర్వం తన శత్రువుని ఓడించి పగతీర్చుకున్నాననే సంతృప్తి ఒకవేపు కలిగినా మంచి తలంపులుకూడా ఒకవేపు కలిగాయి. చివరికి మంచి తలంపులే నిలిచాయి. చాలాకాలంనించీ స్నేహంగా వుంటూ వచ్చిన డుబ్రోవుతో మంచిగా వుందామనుకున్నాడు. అతని ఎస్టేటు తిరిగి అతనికి ఇచ్చేద్దామనుకున్నాడు. శత్రుత్వం నాటినించీ విడిచిపెట్టాలనుకున్నాడు. ఈ మంచి తలంపు కలగగానే అతని హృదయం తేలికపడింది. వెంటనే బండీని పరుగెత్తించి డుబ్రోవు ఇంటి ఆవరణ చేరాడు.

ఆ సమయంలో జబ్బుమనిషి పడకగది కిటికీదగ్గర కూర్చుని వున్నాడు. ఆ బండిమీద వచ్చేది పెట్రోవిచ్ అని గుర్తించగానే అతనిముఖంలో తొట్రుపాటు, భయం కనిపించాయి. కళ్ళు చింతనిప్పుల్లా మెరిసాయి. ఒక్కసారిగా అతని బుగ్గల్లోని రంగు మారిపోయి తెల్లబడింది. నోట్లోంచి ఏవో అస్పష్టమైన మాటలు వెలువడ్డాయి. అక్కడే లెక్కలు వ్రాసుకుంటున్న వ్లాడిమర్ తలయెత్తి చూసేసరికి తండ్రిము

ఖంలో అకస్మాత్తుగా ఏర్పడిన మార్పుకి భయపడ్డాడు. జబ్బు నుంచి కోపంతోనూ భయంతోనూ కిటికీవేపు చూపిస్తున్నాడు. తొందర తొందరగా పడకదుస్తులు సవరించుకుంటూ లేవడానికి ప్రయత్నిస్తున్నాడు. కుర్చీలోంచి కొంచెంలేచి హఠాత్తుగా నేలమీద పడిపోయాడు. వ్లాడిమర్ గభాల్న తండ్రి దగ్గరికి పరుగెత్తి వెళ్లాడు. ముసలాయన స్మృతితప్పి పడిపోయి వున్నాడు ఊపిరి తియ్యలేకుండా వున్నాడు. ఏదో ఉద్రేకం వల్ల ఇలా జరిగింది. వేగం ఊళ్లోకిపోయి వెంటనే వైద్యుణ్ణి తీసుకురండి. ఊఁ వేగం అని నౌకర్లతో చెప్పాడు వ్లాడిమర్.

అప్పుడే నౌకరువచ్చి "పెట్రోవిచ్ మిమ్మల్ని చూడ్డానికి వచ్చారు" అని చెప్పారు.

వ్లాడిమర్ వాడివేపు క్రూరంగా చూశాడు.

'వెళ్ళి వెంటనే పెట్రోవిచ్‌తో చెప్పు. తక్షణం ఇక్కడనించి పొమ్మను వెళ్ళు. తలుపవతలికి నెట్టెయ్యడానికి నేను మనుషుల్ని పంపకముందే పొమ్మని చెప్పు" అన్నాడు.

వెంటనే ఆ మాటలు చెప్పడానికి బయటికి వెళ్లాడు నౌకరు. ఇంతలో దాది యెగొరోవ్నా పరుగునవచ్చి వ్లాడిమర్ని కావలించుకుంటూ ఏడ్చి, 'చిన్నబాబూ! మిమ్మల్ని మీరు పాడుచేసుకుంటున్నారు. ఈ మాటలికి పెట్రోవిచ్ మనందరికీ ముసలం తెచ్చిపెడతారు' అని గోలపెట్టింది.

"యెగొరోవ్నా! ఊరుకో" అని వ్లాడిమర్ కోపంగా అన్నాడు. "వెళ్ళి వైద్యుణ్ణి పిలవమని ఆంటన్‌ని పంపించు"

యెగొరోవ్నా వెళ్లింది. ఇంట్లో ఒక్కరూలేరు. అందరు నౌకర్లు బయటికివెళ్లి పెట్రోవిచ్ వేపు కళ్ళప్పగించి

చూస్తున్నాడు యెగోరోవ్నా ముంగిట్లో నిలబడి చూసేసరికి ఇందాకటి నౌకరు యజమాని అన్నట్టుగా ఆమాటల్ని పెట్రోవిచ్‌తో అనెయ్యడం వింది. బండిలో కూర్చున్న పెట్రోవిచ్ ఆ మాటలు వినేసరికి ముఖం మాడిపోయింది. తర్వాత అతని పెదవులమీద విషపునవ్వు కనిపించింది. నౌకర్లవేపు క్రూరంగా చూసి బగ్గీ మళ్ళించుకొని వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతూ ఒకసారి ఇందాక దుబ్రోవు కూర్చున్న కిటికీవేపు చూశాడు. అక్కడ మరి దుబ్రోవు లేడు. వ్లాడిమిర్ చెప్పిన మాటలే మరిచిపోయి యెగోరోవ్నా నివ్వెరబోయి ముంగిట్లో నిలబడిపోయింది. నౌకర్లంతా జరిగిన సంగతిని ఒకళ్ళతో ఒకళ్ళు చెప్పుకుంటున్నారు. ఇంతలో హఠాత్తుగా వ్లాడిమిర్ వాళ్ళమధ్య కనిపించాడు.

'ఇక వైద్యుడి అవసరంలేదు. నాన్నగారు చచ్చిపోయారు.' అన్నాడు. అందరూ తొట్రుపాటు పడ్డారు. నౌకర్లు ముసలాయన గదిలోకి తొందరగా చొరబడ్డారు. ముసలాయన సోఫాలో పడివున్నాడు కుడిచేయి వేలాడుతూ నేలనితాకింది తలవాలిపోయి వుంది. బొందిలో ప్రాణంవున్న సూచనయేదీ లేదు. యెగోరోవ్నా బావురుమని ఏడుస్తోంది. శవం భద్రతగా చూడవలసిన నౌకర్లు, శవంచుట్టూ చేరి, నీళ్ళతో శవాన్ని స్నానం చేయించి, 1797 సంవత్సరంలో అతని కోసం కుట్టించిన దుస్తుల్ని వేయించారు. ఇన్నేళ్లూ ఏ బల్లమీదైతే తమ యజమానికి వడ్డనచేసేవారో ఆ బల్లమీదనే ఇప్పుడు యజమాని శవపేటికను ఉంచారు.

# 5

మూడురోజులనాడు అంత్యకర్మలు జరిగాయి. శవాన్ని బట్టలతో కప్పి, పెట్టెలోపెట్టి, బల్లమీద ఉంచి చుట్టూ కొవ్వొత్తి దీపాలు వెలిగించారు భోజనాలగది నౌకర్లతో నిండిపోయింది. చేర్చవలసిన చివరిచోటికి శవాన్ని తీసుకు వెళ్ళడానికి చూస్తున్నారు వ్లాడీమరు, ముగ్గురు సేవకులుకలిసి శవం ఉంచిన పెట్టెని ఎత్తారు. అర్చకుడు ముందు దారి తీశాడు. మరొకరు మంత్రాలు చదివారు కీర్తనలు పాడారు. అందరూ బయలుదేరారు. క్రిస్టెనెవకా యజమాని ఆఖరు సారిగా తన యిల్లువిచిడి వెళ్ళిపోతున్నాడు. చెట్లపక్కనించి తీసుకు వెళ్లారు శవాన్ని. అక్కడే చర్చివుంది. చలికాలం వచ్చినప్పటికీ ఎండ బాగా కాస్తోంది. కొన్ని చెట్లనుంచి ఆకులు రాలి పడుతున్నాయి. శ్మశానంలో ఎన్నో తరాల నాటి నిమ్మచెట్ల మధ్య కర్రలతో కట్టిన క్రిస్టెనెవకా చర్చి కనబడింది. అక్కడే వ్లాడిమరు తల్లి అస్థికలు బూడి దయ్యాయి. ఆమె చితి పక్కనే నిన్ననే ఒక గొయ్యి త్రవ్వ బడింది.

ఆఖరుసారి తమ యజమానికి నమస్కారాలు అర్పించ డానికి క్రిస్టెనెవకా గ్రామంలోని రైతులు చర్చికి వచ్చారు. వ్లాడీమరు పూజామందిరంలో నించున్నాడు. ఏడవనూలేదు. ప్రార్థించనూలేదు. అతని ముఖం చాలా భయంకరంగా వుంది. కర్మ పూర్తయింది. మొట్టమొదట శవానికి వ్లాడిమర్ నమస్కరించాడు. తర్వాత నౌకర్లంతా నమస్కరించారు

శవపేటిక మూత తెచ్చారు. ఆడవాళ్లంతా గొల్లున ఏడుస్తుండగా, మగవాళ్ళు వేళ్ళతో కళ్లు తుడుచుకుంటూవుండగా శవం ఉంచిన పెట్టికి మూతవేసి బిగించారు. వ్లాడిమర్, ముగ్గురు నౌకర్లు ఆ శవపేటికను ఎత్తుకొని స్మశానానికి తీసుకువెళ్ళారు. పల్లె ప్రజలంతా అక్కడే వున్నారు. అంతకు పూర్వమే తవ్వబడిన గోతిలో ఆ పెట్టిని దించి మన్నుకప్పారు. ప్రతీ మనిషీ తలా ఒక పిడికెడు మన్ను వేశారు. గొయ్యి పూర్తిగా కప్పాక అందరూ అంతిమ నమస్కారం చేసి వెళ్లిపోయారు. వ్లాడిమరు అందరికంటె తొందరగా నడిచి ఆ చెట్లగుబురుల్లోంచి ఎక్కడికోపోయి మాయమయ్యాడు.

చిన్న యజమాని తరఫున, దాది యెగొరోవ్నా, శ్రాద్ధపు భోజనానికి అర్చకుడి కుటుంబాన్నీ, మరికొందర్నీ తనే పిలిచింది. భోజనాలసమయంలో చిన్న యజమాని ఉండడని కూడా చెప్పింది. అర్చకుడు, అర్చకుడి భార్య, మరొక స్వామి కాలినడకని భోజనానికి డుబ్రోవు ఇంటికి బయులుదేరారు. దారిపొడుగునా యెగొరోవ్నాతో – చచ్చిపోయిన డుబ్రోవు గుణగణాలగురించీ తర్వాత వారసుడైన కొడుక్కి ఇకమీదట రాబోయే అవస్థలగురించీ మాటాడుతూవచ్చారు.

పెట్రోవిచ్ ఆ ఊరు రావడం, అక్కడ అతనికి జరిగిన పరాభవం, అప్పుడే చుట్టుపక్కల చాలా వరకూ పాకిపోయింది. అందుకు ఫలితంగా గొప్పదారుణాలు జరుగుతాయని కొందరు జ్యోతిషం చెప్పడం దాకా వచ్చింది.

అర్చకుడిభార్య ఇలా అంది. 'కర్మఎలా వ్రాసివుంటే అలా జరక్క మానదు; గాని వ్లాడిమరు మన యజమాని కాక పోవడం మనందరికీ చిన్నతనమే–ఎందుకంటే వ్లాడిమరు చాలా–సాహసవంతుడు!"

"ఏం? అతను కాకపోతే ఇంకెవరు మన యజమాని?" అన్నది దాది.

'పెట్రోవిచ్ ఏం పెద్ద కబుర్లు చెప్పనక్కరలేదు వ్లాడిమరు అతని కేం తీసిపోడు, ఎందులోనూ–అన్నిటికీ స్వయంగా నిలబడగలడు; అవసరమైతే అతనికి సాయపడే వాళ్లుకూడా వున్నారు. పెట్రోవిచ్‌కి డాబుసరి తప్పిస్తే ఏముంది? అబ్బాయిగారి బంట్రోతు గ్రిషా 'పోరాకుక్కా, పోపో" అని పెట్రోవిచ్‌ని అన్నప్పుడు ఏం చెయ్యగలిగాడు. ముఖం మాడ్చుకుని చల్లగా జారిపోయాడు.' ఆ మాటలికి స్వామికి ఆశ్చర్యం వేసింది.

"ఏమిమేమిటి యెగొరోవ్నా! గ్రిషా అంతంతమాటలు పెట్రోవిచ్‌ననడానికి ఎలా ధైర్యం చేశాడో వింతగావుంది! నామట్టుకునేను పెట్రోవిచ్‌ని తొంగి చూడడానికి కూడా తెగించలేను, అతను కనిపించాడనేసరికి భయంతో వణకి పోయి చెమటలు కారిపోతాయి. నడుము ఫళక్కని విరిగినట్టని పిస్తుంది" అన్నాడు స్వామి.

ఆమాటకి అర్చకుడు కూడా అందుకున్నాడు.

"మహాంగరిష్ఠి! మన యజమాని దుబ్రోవుకి జరిగినట్టే వాడికూ‌డా ఒకప్పుడు అంత్యక్రియలు జరిగితీరాల్సిందే

గదా! కాకపోతే వాడిచావుకి ఇంతకంటె పెద్ద హడావుడి జరగవచ్చు; భోజనానికి ఇంతకంటె ఎక్కువమంది రావచ్చు గాని భగవంతుడి దృష్టిలో అంతా ఒకటే—

దాది యెగొరోవ్నా ఇలా అంది:-

"మేము ఈ ఊళ్లో అందర్నీ భోజనానికి పిలుద్దామనే అనుకున్నాం గాని వ్లాడిమర్ బాబు ఒప్పుకోలేదు. బోలెడు దినుసులున్నాయి. ఎంత పెద్దసంతర్పణ అయినా చెయ్యొచ్చు గాని అవలేదుమరి! అయితేనేం లెండి; వచ్చినవాళ్లు తక్కువ మందే కాబట్టి .మీ అందరికీ చాలాగౌరవంగా ఏర్పాటులు చెయ్యగలం."

అందరూ మెప్పుమాటలతో అడుగులు వేగంగా వేసుకుంటూ చివరికి డుబ్రోవ్స్కీ యిల్లు చేరుకున్నారు. అప్పుడే అక్కడ బల్లమీద వంటకాలన్నీ వడ్డించే వున్నాయి. వోడ్కా కూడా ఏర్పాటు చేసివుంది.

ఇక్కడ వ్లాడిమర్ దుఃఖాన్ని ఆపుకోడానికి ఎంతో ప్రయత్నం చేస్తున్నాడు. ఎక్కడికి నడుస్తున్నాడో కూడా తెలీకుండా అదేపనిగా నడుస్తున్నాడు. చెట్లడొంకల్లోంచి నడవడంలో చెట్లకొమ్మలు, ముళ్లూ అతని చేతులికి ముఖాలికీ తగులుకుని గీసుకుపోతున్నా, బురదలో కాళ్లు పూడ్చుకుపోతున్నా లెక్కచెయ్యడంలేదు. చివరికి తుప్పలతో నిండిన ఒక డొంకలో పడ్డాడు. చెట్లగుండా ఒక సెలయేరు నెమ్మదిగా పారుతోంది. చెట్ల ఆకులు దాదాపు సగానికిపైగా రాలిపోయాయి. వ్లాడిమర్ అక్కడ ఆగిపోయి, ఒక చల్లనినీడలో

పచ్చికమీద కూర్చుని ఆలోచనలు మొదలుపెట్టాడు. ఒం టరి మనిషైపోయాననే తలంపు అతని దుఃఖాన్ని ఎక్కువ చేసింది. రాబోయే కాలమంతా మేఘాలతో నిండివున్నట్లగు పించింది. ఇంకా శత్రుత్వం వహించిన పెట్రోవిచ్ మరిం కెన్ని దారుణాలు చేస్తాడో అనిపించింది. తన ఆస్తంతా ఇత రుల చేతులలో పడిపోయింది. తనకు మిగిలేది దరిద్రమే! అలాగే నిశ్చలంగా ఆ సెలయేటి గట్టున కూర్చుని చూస్తు న్నాడు. ఆ సెలయేటి ప్రవాహంలో రాలిన ఆకులు కొట్టుకు పోతూ, "జీవితం అంటే ఇంతే" అని చెప్పినట్టనిపించింది.

చివరికి అక్కడ చీకటి కమ్ముకువస్తున్నట్టు వ్లాడిమర్ కి తట్టింది. లేచి ఇంటికి దారి ఎలాగా అని కొత్త ప్రదేశమంతా కలియ జూశాడు. కాసేపు ఇటూఅటూ నడవగా ఆఖరికి ఇంటిదారి కనిపించింది. ఇంటివేపు వెళ్తుండగా దారిలో అత నికి అర్చకుడు, అతని బృందం ఎదురయింది. అది చెడుశకు నం అని అతని మనసుకు తట్టింది. అందుకని బుద్ధిపూర్వకంగా పక్కకి తప్పుకుని చెట్లచాటున దాగున్నాడు. వాళ్ళతన్ని చూడనేలేదు. వాళ్లు దారమ్మట వాళ్లు మాటాడుకుంటూ పోతున్నారు.

"చెడు" విడిచిపెట్టి "మంచి" అలవర్చుకో-ఇక్కడ మనల్ని చేసేదేమీలేదు. ఇక్కడ ఏం జరిగినా నీకు వచ్చే దేమీ వుండదు, 'అని అర్చకుడు భార్యతో అంటున్నాడు. భార్య ఏదో జవాబు చెప్పింది గాని ఆ మాటలు వ్లాడిమర్కి వినిపించలేదు.

ఇంటికి చేరేసరికి ఇంటిముందు పెద్దమూక కనిపించింది. రైతులూ ఇంటి నౌకర్లూ అంతా వాకిట్లో నుంచున్నారు. ఏవో పెద్ద గుసగుసలూ కోలాహలం దూరానికి కనిపించింది. బళ్ళు ఆగే చోట అక్కడ రెండు బగ్గీలు నిలబడ్డాయి. ఏమి టేమిటో మాటాడుతూ కొందరు కొత్త మనుషులు ఒకేరకం దుస్తులు వేసుకుని అక్కడున్నారు.

"ఏమిటిదంతా?" అని వ్లాడిమర్ అక్కడున్న బండి వాడు ఆంటన్‌ని అడిగాడు.

"వాళ్ళంతా ఎవరు? వాళ్ళకేమిటి కావాలి?" అని ప్రశ్నించాడు ఆంటన్ పరుగున వచ్చాడు.

'అయ్యో! చినబాబుగారూ! వాళ్ళు జిల్లాకోర్టు మను షులు! మమ్మల్నందర్నీ పెట్రోవిచ్‌కి అప్పగించి మీ దగ్గ ర్నుంచి తీసుకుపోడాని కొచ్చారు. బాబూ" అన్నాడు.

వ్లాడిమర్ తలవంచాడు. నౌకర్లంతా దిగాలుపడ్డ యజమాని చుట్టూ చేరారు. "మీరే మా తండ్రులు-మీరు తప్ప మరి మాకే యజమానీవద్దు-మీరు మాట యివ్వండి. మేం ఈ కోర్టు మనుషుల పని చూసుకుంటాం! మిమ్మల్ని విడిచిపెట్టడంకంటే మేమంతా మీ ముందు ప్రాణాలైనా వదిలేస్తాం" అని అందరూ గొల్లుమని వ్లాడిమర్ పాదాల ముందు పడ్డారు.

వ్లాడిమర్ వాళ్ళని చూడగానే అతని మనసులో వింత ఆలోచనలు కలిగాయి.

"మీరంతా నెమ్మదిగా ఇక్కడుండండి. నేను వెళ్లి వాళ్ళతో మాటాడతాను." అన్నాడు అంతలో "మాటా డండిబాబూ మాటాడి ఆ కుక్కలికి సిగ్గువచ్చేట్టుచెయ్యండి" అని మూకలోంచి ఎవరో అన్నారు. వ్లాడిమర్ కోర్టు మను ష్యుల దగ్గరికి వెళ్లాడు. తలమీద టోపీతో నడుములమీద చేతులతో, షెబాష్కిన్ చుట్టూచూస్తున్నాడు. అమీనా పొడవుగా లావుగా ఏభయియేళ్ళ ప్రాయంలో వున్నవాడు. ముఖం కందగడ్డలా ఎర్రగావుంది. మీసాలు ఒత్తుగా వున్నాయి. దగ్గరికి వస్తున్న వ్లాడిమర్ని చూడగానే ఆ అమీనా గొంతుస్థాయి హెచ్చించి కర్కశంగా అంటు న్నాడు;

'ఇంకోసారి చెబుతున్నాను మీకు! జల్లాకోర్టువారిచ్చిన తీర్పు ప్రకారం, మీరంతా పెట్రోవిచ్‌కి చెందుతారు. ఈ వకీలు షెబాష్కిన్ వారి తరపున వకాల్తా పుచ్చుకుని అధి కారం పుచ్చుకున్నారు. కాబట్టి అతని ఆజ్ఞలు మీరంతా శిరసావహించాలి. ఇక మీ ఆడవాళ్ళ సంగతి, మిమ్మల్ని ఆయన ప్రేమిస్తారు గాబట్టి మీరంతా ఆయన్ని ప్రేమించ డానికి ప్రయత్నించడం మంచిది.'

ఈ మాట అన్నాక అమీనా పకాల్న నవ్వాడు. తను ఆడిన హాస్యానికి తనకే సంతోషమయింది. అతని మాటకి వకీలు షెబాష్కిను, మిగతా ఉద్యోగస్థులుకూడా పకపకనవ్వారు. ఈ అవమానానికి వ్లాడిమర్ కోపంతో మండి పడ్డాడు.

'మీ ఉద్దేశమేమిటో తెలుసుకోవచ్చా' అని అమీ నాని కోపంగా అడిగాడు. దానికి మొరటు అమీనా ఇలా జవాబిచ్చాడు.

"ఉద్దేశమేమిటంటే, ఈ ఎస్టేటు నగ్గరాలన్నీ పెట్రో విచ్ కి స్వాధీనపరచడానికీ, ఇక్కడ కొంతమంది మనుషుల్ని అతనికి అప్పగించడానికీ వచ్చాం"

'నా రైతులతో మాటాడ్డానికి పూర్వం. నాతో ముందు మాటాడవలసింది మీరు.' అన్నాడు వ్లాడిమర్. పెబాష్కిను జోక్యం చేసుకుని, అతనివేపు నిర్లక్ష్యంగా చూస్తూ అన్నాడు.

'మధ్య మీరెవరు? పాతయజమాని దుబ్రోవుస్కీ చచ్చిపోయాడు కాబట్టి, మీరెవరో మాకు తెలీనూ తెలీదు. తెలుసుకోవలసిన ఆవసరమూ లేదు.

'అతను మా చిన్న యజమాని వ్లాడిమరు' అని మూక లోంచి ఎవరో అన్నారు.

"ఎవడా అన్నది" అని అమీనా గద్దించి బెదరించి, అడిగాడు.

ఎలాటి యజమాని మీకు? ఎవరా వ్లాడిమరు? మీ యజమాని పెట్రోవిచ్! తెలిసిందా మట్టిబుర్రల్లారా!

కాదు కాదు. మా యజమాని పెట్రోవిచ్ కాదు. అని మళ్లీ మూకలోంచి ఎవరో అన్నారు.

ఇది తిరుగుబాటులా వుంది. అని అమీనా ఎగిరిపడి మునసబుగారూ, ఇలా రండి, అని పిలిచాడు. మునసబు ముందుకు వచ్చాడు.

మూకలోంచి నాకు జవాబిచ్చిన వాడెవడో నిమషంలో పట్టుకొని తీసుకురండి. వాడి పని పడతాను. అని అమీనా మునసబుతో అన్నాడు.

మూకదగ్గరగా వెళ్ళి మునసబు ఎవరు మాటాడారని ప్రశ్నించాడు గాని ఎవ్వరూ ఒక్కమాటన్నా జవాబివ్వలేదు ఇంతలో మూకలోని ఆఖరి వరసలో ఏవో గుసగుసలు లేచి అంతకంతకీ ధ్వని ఎక్కువై కొద్ది ఘడియల్లో పెద్ద ఘోషగా మారేసరికి అమీనా కొంచెంతగ్గాడు. ఏంచేస్తే బాగుంటుందా అని ఆలోచిస్తున్నాడు.

“లెండి, పదండి–ఇంకా ఎందుకు ఆలస్యం? వాళ్ళపని పడదాం రండి” అని నాకర్లంతా ఎలుగెత్తి అరిచారు. వెంటనే అంతా ముందుకు నడిచారు.

షెబాష్కిన్, మిగతావాళ్లూ ఇంట్లోకి వెళ్ళిపోయారు లోపల గడియలు పెట్టుకున్నారు. “వాళ్ళని పట్టుకోండి” అని గుంపులోని ఒకగొంతుక హెచ్చరించింది. వెంటనే గుంపంతా సముద్రంలా పొంగి ముందుకు నడిచింది.

“ఆగండి–” అని గద్దించాడు వ్లాడిమర్, మూర్ఖుల్లారా! ఏమిటి మీరు చేస్తున్నది? మిమ్మల్ని మీరు నాశనం చేసుకుంటున్నారు. నన్ను కూడా పాడుచేస్తున్నారు! అందరూ ఇళ్ళకి పొండి! నన్నిక్కడ ఒంటరిగా ఉండనివ్వండి. భయపడకండి. మన జార్ చక్రవర్తి దయామయుడు. ఆయనతో నేను మాటాడతాను. మనమంతా అతని బిడ్డలలాంటివాళ్ళం, మనకి ఏ అపాయమూ రానివ్వడాయన! కాని మీరంతా

జెదిరి తిరుగుబాటు చేస్తే అతను మిమ్మల్నెలా కాపాడతా డనుకున్నారు?"

చిన్నయజమాని చెప్పేమాటలు, అతని కమ్మని కంఠ స్వరం విని వాళ్ళంతా శాంతించి ఎవరుమట్టుకువాళ్లు వెళ్ళి పోయారు. ఇంటిముందు ఆవరణ నిర్మానుష్యమై పోయింది. కోర్టు మనుష్యులింకా తలుపులు బిగించుకుని ఇంటిలోనే వుం డిపోయారు. చివరికి షెబాషిక్టన్ చప్పుడు చెయ్యకుండా తలుపు గడియలు తీశాడు; మెల్లగా అడుగులు వేసుకుంటూ ఇంటివసారాలోకి వచ్చి, వ్లాడిమర్ని చూసి వంగి సలాములు చేసి, వాళ్లని కాపాడినందుకు తన కృతజ్ఞత తెలియజేసాడు. వ్లాడిమర్ అతనివేపు అసహ్యంగా చూశాడు గాని అతనితో మాత్రం ఏమీ మాట్లాడలేదు. కాని షెబాషిక్టన్ ఇంకా చెప్పడం మొదలు పెట్టాడు.

"మీ అనుమతిమీద ఈ రాత్రంతా ఇక్కడే గడప డానికి నిశ్చయించుకున్నాం. అప్పుడే చీకటి పడిపోయింది. ఇప్పుడుగాని మేం బయలుదేరితే దారిలో మీవాళ్లు మా మీద దాడి చెయ్యవచ్చు. దయచేసి ఈ గదిలో కొంచెం గడ్డివేయిస్తారూ? తెల్లవారేసరికి మేం బయలుదేరి వెళ్లి పోతాం." అని చెప్పాడు షెబాషిక్టన్.

"మీ యిష్టం వచ్చినట్టు చెయ్యండి ఇంతట్నుంచీ ఇక్కడ నేను యజమానినికాదు." అని నిర్లక్ష్యంగా జవా బిచ్చి, వ్లాడిమర్ తన తండ్రి గదిలోకి వెళిపోయి లోపల గడియ పెట్టుకున్నాడు.

# 6

అంతా . అయిపోయిందన్నమాట! ఈ ఉదయం మాత్రం తలదాచుకునేందుకు ఇల్లూ, తినడానికింత రొట్టె దొరికాయి. రేపు? ఏ ఇంటిలో నేను పుట్టి పెరిగానో, ఏ యింట మా నాన్నగారు పోయారో, ఆ యింటిని- ఎవరైతే మా నాన్న చావుకీ, నా దరిద్రానికీ కారకుడయాడో- అతనికి అప్పగించి పోవాలి.'' అని తనలో అనుకున్నాడు వ్లాడిమర్. ఎదురుగా గోడనున్న తన తల్లి పటంమీాద పడింది దృష్టి! కటకటాలమీాద మోచేతులు ఆనించి, తలలో ఎర్ర గులాబీ పువ్వు తురుముకొని, ప్రొద్దుటిపూట వేసుకొనే తెల్లని దుస్తులు ధరించి వున్నట్టు చిత్రకారుడు చిత్రించాడు. 'ఈ చిత్రం మా నాన్నగారి శత్రువు చేతుల్లో చిక్కుతుంది' అనుకున్నాడు వ్లాడిమర్. 'ఇది కాళ్ళు విరిగిన కుర్చీలూ వగైరాలు పడేసే చెత్తసామానుల గదిలో పారేస్తారు, లేదా నలుగురూ నడిచే వసారాలో తగిలిస్తారు; వేటగాళ్లు వెక్కిరించి వేళాకోళాలు చేస్తారు; మా నాన్నగారు చనిపోయిన, గదిని. అంటే పూర్వం మా అమ్మగారి పడకగది అయిన ఈ పవిత్రమైన గదిని పెట్రోవిచ్ పెత్తందార్లో, అంతఃపుర స్త్రీలో ఉపయోగిస్తారు. వీలులేదు అలా జరగడానికి వీలు లేదు వాడు నన్ను తరిమివేస్తున్న ఈ దుఃఖాల గది, వాడి ఆస్తి కాకూడదు. అని వ్లాడిమరు పళ్ళు పటపట కొరికాడు. అతని మనసులో చాలా క్రూరమైన ఆలోచనలు కలిగాయి. ప్రక్కగదిలోంచి కోర్టుగుమస్తాల గుసగుసలు వినిపించాయి'

ఈ యింటిలో వాళ్ళు దొరల్లా ఏలుబడి సాగిస్తున్నారు. కాస్సేపు ఇది కావాలనీ, మరికాస్సేపు అది కావాలనీ అంటూ అతని ఆలోచనలకి అంతరాయం కలిగిస్తున్నారు. కొంతసేపటికి అంతా నిశ్శబ్దం అయిపోయింది

వ్లాడిమర్ టేబిలు సొరుగులూ, బీరువా అరలూ తెరచి తండ్రికాగితాలన్నీ తెరచి చదవసాగాడు. అవన్నీ ఇంటిలెక్కల పద్దులున్నూ అనేక తరహాల వ్యాపారాలకి చెందిన ఉత్తరాలున్నూ, అవన్నీ వ్లాడిమరు చదవకుండానే చించేశాడు. కాని వాటిలో 'భార్య వ్రాసిన ఉత్తరాలు' అనే కాగితాల కట్టమాత్రం కనిపించింది. వ్లాడిమరుకి అవి చూడగానే ఎక్కడలేని ఆత్రుతా కలిగింది. అవి తురుష్కులు దండయాత్ర చేసిన సమయంలో వ్రాసినవి; పటాలంలోఉన్న డుబ్రోవుకి కిస్టెనెవకా నుండి భార్య వ్రాసిన ఉత్తరాలవి! తను ఒంటరిగా ఉన్నాననీ, ఇంటి విషయాలన్నీ ఇలావున్నాయనీ, ఎడబాటుకి దుఃఖిస్తున్నాననీ వేగిరం అక్కడనించి వచ్చేయమనీ వ్రాసింది ఒక వుత్తరంలో. మరోవుత్తరంలో చిన్నబ్బాయి వ్లాడిమరు బాగున్నాడని తెలుస్తాను అని వుంది. మరోదాంట్లో పెద్ద ఉద్యోగం దొరికినందుకు చాలా సంతోషమైనదనీ. ఇంకా ఇంకా అదృష్టాలు కలగవచ్చనీ వ్రాసివుంది చదవడంలో మునిగిపోయిన వ్లాడిమరు కుటుంబ జీవితంలో ఆనందాల ప్రపంచంలో విహరిస్తూ, బయటి ప్రపంచాన్నే మరిచిపోయాడు. ఎంతకాలమైందోకూడా గుర్తించే స్థితిలో నేలేడు. తాతలనాటి గడియారం పదకొండు గంటలు కొట్టే సరికి తెలివి తెచ్చుకుని తెప్పరిల్లాడు.

అప్పుడా ఉత్తరాలు జేబులో పెట్టుకొని, ఒకకొవ్వొత్తి పట్టుకొని ఆ గదిలోంచి బయటికివచ్చాడు. హాలులో కొందరు మనుషులు గురకలు తీస్తున్నారు. బల్లలుమీద గ్లాసులున్నాయి. గదంతా సారావాసన వేస్తోంది. వీధి తలుపు దగ్గరికి వెళ్తూ వాళ్ళని చాలా అసహ్యించుకున్నాడు. తలుపుకి తాళంవేసివుంది. తాళం చెవి ఎక్కడుందో తెలిసింది కాదు; తిరిగిహాలులోకివచ్చి చూసేసరికి అక్కడ బల్లమీద తాళం చెవి కన్పించింది. అది తీసుకునివెళ్లి తలుపుతీశాడు. తలుపులు తీస్తున్నప్పుడు ఒకమూల ఎవరో మనిషి ఉన్నట్టనిపించింది. ఆ మనిషి చేతిలో ఒక గొడ్డలి మెరిసింది. చేతిలో ఉన్న కొవ్వొత్తి వెల్తురు అతనివేపు చూపించి చూసేసరికి, ఆ మనిషిని పోల్చగలిగాడు వ్లాడిమరు. అతను కమ్మరం పనిచేసే ఆర్కిప్!

ఏంచేస్తున్నావిక్కడనువ్వు? అని ఆర్కిప్ని అడిగాడు.

ఓం మీరా! చినబాబుగారూ! అని ఆర్కిప్ మెల్లగా దేవుడు మిమ్మల్ని రక్షించుగాక! మీరు కొవ్వొత్తి దీపం తేవడం చాలా మంచిదయింది అని సంతోషించాడు.

వ్లాడిమరు నివ్వెరపోయి ఆర్కిప్ వేపు చూడసాగాడు.

ఎందుకిక్కడ ఇలా దాక్కున్నావ్? ఏంచెయ్యాలని కమ్మరిని ప్రశ్నించాడు.

ఏంచేద్దామనంటే-మరేంలేదండి. అంతా సక్రమంగా వుందో లేదో చూద్దామని వచ్చానండి అని నసిగాడు ఆర్కిప్

అయితే ఆ గొడ్డలి దేనికి?

గొడ్డలా? దేనికంటారా? ఇటువంటి సమయాల్లో ఎవ రైనా చేతిలో ఏ ఆయుధం లేకుండా బయటికెలా రాగల డండి? ఈ మనుషులున్నారే చాలా దుర్మార్గులు బాబూ! వీళ్ళు ఏసమయానికేం చేస్తారో ఎవరు చెప్పగలరు!' అన్నాడు ఆర్కిప్.

'నువ్వు తాగివున్నట్టున్నావ్. ఆగొడ్డలి అలా ఒదిలేసి పోయి పడుకో!' అని వ్లాడిమరు మందలించాడు.

తాగి వున్నానా? నేనా? ఎంతమాటదొరా! భగవం తుడి సాక్షిగా నేను ఒక్క చుక్కన్నా ముట్టలేదంటే నమ్మండి. ఈ సమయంలో తాగాలని ఎవరికి మనసొతుంది? కోర్టు గుమ స్తాలు ఏలుబడి చెయ్యడంగాని, ఆస్తులు అపహరించి యజ మానుల్ని తరిమెయ్యడం ఎప్పుడన్నా చూశామా దొరా? చూడండి ఆ వెదవల్ని! ఎలా గురకలుతీస్తున్నారో? వాళ్ళం దర్నీ మనం ఒక్కపెట్టున మాపెయ్యగలం!'

'ఆర్కిప్! నామాట విను! నువ్వనుకున్నది మంచిపని కాదు; ఇది ఈ గుమస్తాల తప్పుకాదు. దీపం వెలిగించి నాతో రా చెప్తాను.'

యజమాని చేతిలోని కొవ్వొత్తి దీపం తీసుకొని ఆ వెల్తురులో ప్రొయ్యి పక్కనున్న లాంతరు వెలిగించి, ఆర్కిప్ యజమానితో వసారా దాటి బయటికి వెళ్లాడు. కావలివాళ్లు ఇనుపకమ్మిని కొడుతున్నారు. కుక్కలు అరుస్తున్నాయి.

'ఎవరిక్కడ కాపలా కాస్తున్నారు?' అని అడిగాడు వ్లాడిమరు.

'మేం బాబూ, వసిలిసా! లుకెర్యా...' అన్నారు ఆ ఆడంగులు.

'మీ యిళ్ళకి వెళ్లిపొండి; మీరింక అవసరంలేదు.' అన్నాడు వ్లాదిమరు.

'మీరు వెళ్ళవచ్చు.' అన్నాడు ఆర్కిప్.

'చిత్తం బాబూ!' అని ఆ ఆడవాళ్ళు సలాములుచేసి ఎవరి ఇళ్ళకి వాళ్లు వెళ్లిపోయారు.

వ్లాదిమరు ఇంకా ముందుకు వెళ్ళాడు; ఇద్దరు మనుష్యులు అతనిదగ్గరికి వచ్చారు. వాళ్ళలో ఒకడు బండివాడు ఆంటన్, మరొకడు తన నౌకరు గ్రిషా!

"ఎందుకు మీరు నిద్రపోలేదు?"

"ఎలా పడుకోగలం మేం దొరా? ఈ విధంగా జరుగుద్దని యెవరన్నా అనుకున్నామా అన్నాడు ఆంటన్.

"చాల్లే-ఊరుకో" అని వ్లాదిమర్ గసరి, "దాది యెగొరోవ్నా యేదీ?" అని ప్రశ్నించాడు.

"తన గదిలో వుంది" అన్నాడు గ్రిషా

"వెళ్ళి ఆవిడని తీసుకురా, ఆ కోర్టు మనుష్యుల్నితప్ప మిగతా అందర్నీ బయటికి పొమ్మని చెప్పు, ఒక్కర్నికూడా వుండనివ్వొద్దు! తర్వాత నువ్వు బండి సిద్ధంచేసి వుంచు" అని గ్రిషాకి ఆజ్ఞాపించాడు.

గ్రిషా లోపలికి వెళ్ళి, తన తల్లి యెగొరోవ్నాని తీసుకువచ్చాడు ఆమె ఇంకా నిద్రపోలేదని తెలుస్తూనేవుంది. ఆ యింట్లో కోర్టువాళ్ళు మినహా ఒక్కరూ కళ్లుమూయలేదు.

"అంతా ఇక్కడే వున్నారా? ఇంట్లో ఎవరూ వుండి పోలేదుకదా!" అని వ్లాడిమర్ సౌకర్ని అడిగాడు.

"కోర్టువాళ్లు తప్పిస్తే ఇంకెవరూ లేరు దొరా," అన్నాడు గ్రిషా.

"కొంచెం ఎండు గడ్డి పట్టుకురా" అని ఆజ్ఞాపించాడు వ్లాడిమర్.

గుర్రాల సాలలోకి పరిగెత్తి, సౌకర్లు మోపులకొద్దీ ఎండుగడ్డి తెచ్చారు.

'అవన్నీ వసారాలో పడేయండి... ఆః...అంతే... ఇప్పుడు నాకో దీపం యివ్వండి.

ఆర్కిప్ దీపం ఇచ్చాడు వ్లాడిమర్ ఒక ఎండుపుల్ల దీపంలో వెలిగించాడు.

'ఆర్కిప్! ఒక్క నిముషం ఆగు, వసారాఅవతలి గది గడియవేసి వచ్చానని జ్ఞాపకం. వెళ్ళి గడియతీసి ఆ తలుపు తెరిచివుంచు"

ఆర్కిప్ పరుగున లోపలికి వెళ్లి, తాళంచెవి తిప్పుతూ "తెరచేదా-వద్దు-వద్దు, అని లోలోపల అనుకుని తిరిగి వ్లాడిమర్ దగ్గరికి వచ్చేశాడు...

వ్లాడిమరు వెలిగించిన ఎండుపుల్లతో వసారాలోని గడ్డిని అంటించాడు. ఎండుగడ్డి మండి, మంటలు హెచ్చి వసారా అంతా పెద్ద వెలుగుతో నిండిపోయింది.

"ఆం! ఆం! ఏంచేస్తున్నారు బాబుగారూ!" అని దాది యెగొరోవ్నా జాలిగా అరవడం మొదలుపెట్టింది.

"నిశ్శబ్దం! ష్!" అని గద్దించాడు వ్లాడిమర్; "సరే మీ అందరికి ఇదే ఆఖరుసారి కన్పించడం... దేవు డెక్కడికి తీసుకు వెళ్తే నేనక్కడికి పోతాను. మీ కొత్త యజమానితో మీరు సుఖంగా ఉండండి."

ఆ మాటకి అందరూ గొల్లుమన్నారు. కంట తడి పెట్టారు.

'అయ్యో బాబూ! మీరే మా తండ్రులు. మిమ్మల్ని విడిచి మేము బ్రతకలేము. మీతోనే మేమూ వస్తాము.'

గుర్రాల్ని సిద్ధంచేసి గ్రిషా బండికి పూన్చాడు. బండిలో వ్లాడిమర్, అతని నౌకరు గ్రిషా కూర్చున్నారు. కిస్టెనెవ్కా తోటలో అందరం కలుసుకుందాం అని ఏర్పాటు చేసి వ్లాడిమర్ బయల్దేరాడు. ఆంటన్ కొరడాతో గుర్రాల్ని అదిలించాడు. అవి పరుగు పుచ్చుకున్నాయి.

పెద్దగాలి వీచింది. ఒక నిముషంలో అగ్నిమంటలు ఇంటినిండా లేచాయి. ఇంటి పై కప్పునించి ఎర్రని మంటలతో పొగ లేచింది. అద్దాలు బ్రద్దలై నేలమీద పడ్డాయి. నిప్పు సెగలు గాలిలో ఎగిరిపడ్డాయి. జాలిగా అరపులూ, ఏడ్పులూ లోపల్నుంచి వినబడ్తున్నాయి 'మంటల్లో కాలిపోతున్నాం మమ్మల్ని రక్షించండి' అని మొరపెట్టు కుంటున్నారు.

ఆర్కిప్ వికృతంగా నవ్వి 'అంతే కావాలి. అంతే కావాలి' అన్నాడు.

అయ్యో, ఆర్కిప్ బాబూ! పాపం వాళ్ళని కాపాడు, దేవుడు నీకు మేలు చేస్తాడు.' అని దాది యెగొరోవ్నా బతిమిలాడింది;

'వద్దు. వద్దు.' అన్నాడు ఆర్కిప్.

ఇంతలో కొందరు మనుషులు కిటికీ ఊచలన్నీ ఊడగొట్ట డానికి ప్రయత్నిస్తూ కిటికీ దగ్గరికి చేరారు. కాని ఇంతలో పెద్ద శబ్దంతో ఇంటి పై కప్పు క్రింద పడింది. దాంతో మరి ఏడుపులూ అరుపులూ వినబడలేదు.

కాస్సేపటికి నౌకర్లంతా ఇంటి ఆవరణలో మూగారు. ఆడవాళ్లు రాగాలు తీస్తూ లోపల ఉండిపోయిన సామాన్లు తీసుకోవా లనుకుంటున్నారు. పిల్లలు కిందా మీదా గెంతు తున్నారు. మంటలవేపు ఆనందంగా చూస్తూ, నిప్పు సెగలు పై కెగిరి భయోత్పాతం కలిగిస్తూ చుట్టుపక్కల ఇళ్ళమీద పడి నిప్పంటుకున్నాయి.

'అద్గదీ వరస! ఎలా మండుతుందో చూడండి. సెబాష్! పాక్రోవుస్కోయి గ్రామంనుంచి చూస్తే ఈ మం టలు మరీ అందంగా కనిపిస్తాయి' అని ఆర్కిప్ మురిసి పోతున్నాడు.

కాని ఇంతలో ఏదోకొత్త వింత అతని దృష్టిని ఆకర్షిం చింది. కాలిపోతున్న ఒక దూలంమీద ఒక పిల్లి అరుస్తూ ఎటుచూసినా మంటలే అవడంవల్ల ఎటూ గెంతలేని స్థితిలో కనబడింది. మ్యావ్ మ్యావ్ మని జాలిగా సహాయం కోసం అరుస్తోంది. పాపం! దాని నిస్సహాయస్థితి చూస్తుంటే పిల్లలకి నవ్వు ఆగిందికాదు.

'ముర్రకుంకల్లారా! దేనికిరా అలా నవ్వుతారు?'' అని ఆర్కిప్ వాళ్ళని కోప్పడ్డాడు. పాపభీతిలేదు మీకు! దేవుడు సృష్టించిన జంతువుల్లో ఒకటి చచ్చిపోతుంటే మీకు నవ్వు

తాలుగావుండరా వాడెవ్వళ్ళూరా?' అని గదమాయించాడు. వెంటనే ఒక నిచ్చెన వేసుకుని కాలిపోతున్న దూలంమీదికి ఎక్కి పిల్లిని రక్షించడానికి ప్రయత్నించాడు. దానికి ఇతని ఉద్దేశం బోధపడి ఛెంగున అతని మోచేతుల మీదికి ఎగిరి తన కృతజ్ఞత తెలియజేసింది. పాపం ఆర్కిప్‌కి చాలా చోట్ల కాలిపోయింది. అయినా లక్ష్యపెట్టక నిచ్చెనదిగి పిల్లితోసహా క్రిందికి వచ్చేశాడు.

'అయ్యా. అందరికీ సెలవు,' అన్నాడు ఆర్కిప్ అక్కడవున్న దిగులుపాటుతో వున్న అందరి నౌకర్లతోనూ', ఇక్కడవుండి నేను చెయ్యవలసిన పనేమీ లేదు. వెళ్తాను. అంతా సుఖంగా ఉండండి, ఎవరికైనా నేను ఎప్పుడైనా ద్రోహం చేసివుంటే నన్ను క్షమించండి''.

ఆర్కిప్ అక్కడనించి వెళ్ళిపోయాడు. మంటలు మరి కొంతసేపు అలావుండి, ఆఖరికి సెగలు చల్లారి, బూడిద మాత్రం మిగిలింది; చిన్న చిన్న నిప్పురవ్వలతో మెరుస్తూ పాపం ఇళ్ళులేని కిస్తెనెవ్కా ప్రజలు చుట్టూచేరి ఏడుస్తున్నాడు.

# 7

మర్నాడే ఈ అగ్ని ప్రమాదపు వార్త జిల్లా అంతా ప్రాకిపోయింది. ప్రతివాడూ దీన్నిగురించే మాట్లాడ్డం... ఎవరి ఊహాలు వాళ్లు చెప్పడం...కొందరనుకోవడమేమి టంటే వ్లాడిమర్ నౌకర్లు చావు భోజనాల సమయంలో

మస్తుగా తాగి, ఆ తాగుడు మైకంలో ఇంటికి నిప్పంటించారని. మరికొందరనేదేమంటే కోర్టు మనుషులే దౌర్జన్యంగా ఇంటిని స్వాధీనం చేసుకుని ఆ పని చేశారని... అయితే చాలా మంది మాత్రం ఏదో ప్రమాదంవల్ల ఇంటికి నిప్పంటుకుందనీ జిల్లాకోర్టు మనుషులంతా, ఇంట్లో వున్నవారంతా కాలిపోయి చచ్చిపోయారని అనుకున్నారు. కాని చాలా కొద్దిమందికి మాత్రం నిజం తెలిసి కోపంతో వ్లాడిమరే ఈపని చేశాడని చెప్పుకున్నారు.

ఆ మర్నాడు పెట్రోవిచ్ కాలిపోయిన చోటికి వెళ్ళి చూసి, ఈ కుట్ర ఎవరు పన్నారో ఆరాలు తీయమని దర్యాప్తు చేయించాడు. కోర్టు అమీనా ఒకడు; వకీలు షెబాషిన్, మరో యిద్దరు గుమస్తాలు, వ్లాడిమర్, అతని దాది యెగొరోవ్నా ఆమె కొడుకు గ్రిషా, బండివాడు ఆంటన్, కమ్మరి ఆర్కిప్ వీళ్లు మాత్రం అగ్ని ప్రమాదంలోంచి తప్పించుకు పారిపోయారని దర్యాప్తులో తెలిసింది.

మిగతా గుమస్తాలంతా, ఇంటిపై కప్పు కిందపడగానే చచ్చిపోయినట్లు నౌకర్లంతా చెప్పారు. తర్వాత తవ్వించి చూస్తే వాళ్ళ ఎముకలు కనబడ్డాయి. కాపలా ఆడంగులు వసిలిసా, లుకర్యాలు మంటలకుపూర్వం వ్లాడిమర్ని ఆర్కిప్నీ చూశామని చెప్పారు. అందరి సాక్ష్యాలిని బట్టి, కమ్మరి ఆర్కిప్ ఇంకా బ్రతికే వున్నాడనీ అతనే దీనికి కథానాయకుడు కాకపోయినా సూత్రధారుడనీ తెలుసుకున్నారు. వ్లాడిమర్ డుబ్రోవ్స్కీని అనుమానించారు. "వ్లాడిమర్"ని అందరూ 'డుబ్రోవ్స్కీ' అని తండ్రి పేరుతోనే పిలుస్తారు కాబట్టి

ఇకనించి మనం కూడా వ్లాడిమిర్ని దుబ్రోవ్స్కీ అనే అంటుందాం.

జరిగిన సంగతి యావత్తూ పెట్రోవిచ్, గవర్నరుగారికి సవిస్తరంగా తెలియపరుస్తూ, కొత్తకేసు ప్రారంభించాడు. ఇంతలోనే మరికొన్ని విశేషాలు వింతలు జరిగి ప్రజల్లో ఆందోళన కలిగించాయి. ఒకనెల్లో ఒక దొంగలముఠా బయలుదేరి చుట్టుపక్కలంతా బెదరగొట్టింది. వాళ్లని అరికట్టడానికి అధికారులు చేసిన ప్రయత్నాలేవీ పనిచెయ్యలేదు. ఒకటి తర్వాత ఇంకొకటి. ఒకదాన్ని మించి మరొకటి దొంగతనాలు జరిగాయి. త్రోవల్లోగాని పల్లెలలోగాని ఎక్కడా రక్షణ అంటూలేదు. జిల్లాలో పట్టపగలే బగ్గీలమీద స్వారీ చేస్తూ దొంగలు బయలుదేరి బాటసారుల్నీ, బళ్ళనీ దోచుకోవడం ఆరంభించారు. గ్రామాలలో చొరబడి భూస్వాముల ఇళ్ళల్లో ఆస్తులు దొంగిలించి ఇళ్ళకి నిప్పులంటించేవారు. ఆ దొంగల నాయకుడు బలే గజదొంగ అనీ, రాక్షసుడనీ, చాలానేర్పరి, గొప్పవాడనీ, చెప్పుకుంటున్నారు. అందరి నోళ్ళచివరా "దుబ్రోవుస్కీ" పేరే ఆడేది. ఈ బందిపోటు దొంగ లందరికీ అతనే నాయకుడనీ, అంతపాటివారు మరెవరూ లేరని అందరూ అనుకున్నారు. ఒక్క విషయం మాత్రం అందరికీ విడ్డూరంగా వుంది. ఏమంటే ఈ దొంగలు పెట్రోవిచ్ ఎస్టేటుమీదికి ఎప్పుడురాలేదు. అందులో ఒక్క పూచికపుల్లైనా ముట్టలేదు. ఆఖరికి పశువుల్ని కూడా దొంగిలించలేదు! అందుచేత పెట్రోవిచ్ చాలా గర్వంగా చెప్పేవాడు; జిల్లా అంతా గడగడలాడించే బలం తనకి వుందనీ, గ్రామాలలో పోలీసువాళ్ళని

గస్త్రీ వుంచాననీ అందువల్ల దొంగలమూతా తన ఎస్టేటు పొలి మేరకు కూడా రాదనీ ప్రగల్భాలు పలికేవాడు. మొదట్లో చుట్టుప్రక్కల వుండే భూస్వాములు అతని డాబులకి నవ్వు కునేవారు. కాని రానురాను వాళ్ళుకూడా పెట్రోవిచ్ మాటలు నమ్మవలసి వచ్చేది. దొంగలుకూడా పెట్రోవిచ్‌ని గౌరవిస్తున్నారనుకునేవారు. ప్రతిరోజూ డుబ్రోవుస్కీ దొంగ తనాలు చెవిని పడుతున్నప్పుడల్లా పెట్రోవిచ్ నవ్వుతూ గవర్నరునీ; పోలీసు అధికారుల్నీ ఎగతాళిచేస్తూ డుబ్రోవుస్కీ వాళ్ల చేతుల్లో పడకుండా తప్పించుకున్నందుకు వాళ్ళను చుల కన చేసేవాడు.

ఇంతలో అక్టోబరు నెల మొదటి తేదీ వచ్చింది. పెట్రో విచ్ ఉండే వూరులోని చర్చియజమాని వంతు వచ్చింది. కాని ఈ దోపిళ్ళనీ వాటి తర్వాతి సంగతుల్నీ వర్ణించి చెప్ప డానికి ముందు, మీకు ఈ కథలో ప్రారంభంలో కొంచెం చెప్పినా, పూర్తిగా తెలియని కొంతమంది కొత్తవాళ్ళని పరిచయం చేయవలసిన అవసరం ఉంది.

# 8

పెట్రోవిచ్ కూతురు గురించి మొదట్లో మీకు కొం చెమే చెప్పినా ఆవిడే ఈ కథకి నాయకురాలవుతుందని మీరీ పాటికి ఊహించే వుంటారులెండి.

ఈ కథ మొదలైన వేళకి ఆమెకి పదిహేడేళ్లుంటాయి. నిండు యౌవనం వచ్చిందన్నమాట. తండ్రికి కూతురంటే

అభిమానమేగాని - ఆమెనుకూడా తన మామూలు తీరు లోనే-అంటే-ఒక్కొక్కప్పుడు ఆవిడ సరదాలన్నీ పూర్తిగా తీర్చేవాడు - ఒక్కొక్కప్పుడు నిర్దాక్షిణ్యంగా బెదరగొట్టే వాడు. కుమార్తెకి తండ్రి అంటే ప్రేమే అని తనకి తెలిసినా తన్ను మాత్రం ఆమె నమ్మే విధంగా చెయ్యలేకపోయాడు. ఆవిడ ప్రతి విషయం ఆతని దగ్గర దాచేది. తన తలంపులన్నీ తనలోనే ఉంచుకునేదిగాని తండ్రితో చెప్పేదికాదు. ఆవిడికి స్నేహితురాళ్లెవరూ లేరు. ఒంటరి తనంలోనే పెరిగింది. చుట్టు ప్రక్కల వుండే భూస్వాముల భార్యలు, కూతుళ్లూ ఎప్పుడో కాని పెట్రోవిచ్ యింటికి వచ్చేవారుకారు. కారణం పెట్రో విచ్ కూతురు వాళ్ళతో అట్టే మాటాడేది కాదు; ఆవిడ సర దాలు కూడా వాళ్ళకి సరిపోయేవికావు; ఆవిడకి నిజంగా కావల్సింది ఆడవాళ్ళ స్నేహం కానేకాదు. మగవాళ్ళతో స్నేహం ఆమెకి కావాలి! పెట్రోవిచ్‌తోబాటు భోజనం చెయ్యడానికి కూర్చునే అతిధులతోకూడా ఎప్పుడోకాని ఆవిడ కూర్చునేదికాదు. 18 వ శతాబ్దపు ఫ్రెంచికవుల పుస్త కాలు బీరువాలకొద్దీ ఆవిడ దగ్గర వున్నాయి. "అందమైన వంట అమ్మాయి" అనే నవల తప్పిస్తే జన్మలో మరే పుస్త కం చదవని తండ్రి, కూతురికి కావలిసిన పుస్తకాలేవో సలహా యివ్వలేకపోయాడు అంచేత "మాషా" తనకి కావల్సిన గ్రంథాలు తనే ఎంచుకొని చాలారకాల నవలలు చదివింది. మొట్టమొదట "మిమ్మా" అమ్మగారితో మొదలైన మాషా చదువు ఇలా పూర్తయింది. మిమ్మా అమ్మగారంటే పెట్రో విచ్‌కి ఎంతో విశ్వాసం, ఎంతో అభిమానం. కాని చివరికి

పెట్రోవిచ్ ఆ అమ్మగార్ని ఇంకో ఎస్టేటుకి పంపించక తప్పిందికాదు. ఆవిడ వెళ్లిపోయిందన్నమాటేగాని మిమ్మీ రోజూ చల్లని వేళలలో జ్ఞాపకం వస్తూనే వుండేది. ఆమె హృదయం చాలా మంచిది. ఎంతోమంది అమ్మగార్లు ఒకరి తర్వాత ఒకరు తొందర తొందరగా మారిపోయారు గాని ఈవిడ మాత్రం అంత తొందరగా మారలేదంటే ఈమెలో ఏదో విశేషం వుందన్నమాట! తతిమావాళ్ళకంటే కూడా ఆమెనే ఎక్కువ ఇష్టపడేవాడు పెట్రోవిచ్ మిమ్మీ యొక్క దక్షిణాది పోలికల్ని బాగా జ్ఞాపకంతెచ్చే తొమ్మిదేళ్ళ ఆ నల్లకళ్ల వెధవాయిని పెట్రోవిచ్చే పెంచి పెద్దచేసి తన కొడుకని అనిపించుకున్నాడు. అయితే తనని పోలిన పిల్ల కాయలు ఎంతమందో కాళ్లకి జోళ్లయినా వేసుకోక కిటికీల పక్క తిరుగులాడుతూ వట్టి పల్లెటూరి రైతుపిల్లలకంటే అధ్వాన్నంగా తయారైయారు.

తన చిన్నకొడుకు 'సాషా' కోసం, ఈ అల్లరులు జరుగుతున్న సమయంలోనే పొక్రోవుస్కోయి గ్రామానికి, మాస్కోనుంచి వచ్చిన ఫ్రెంచి మేష్టరుని చదువు చెప్పడానికి ఏర్పాటు చేశాడు.

అతని వినయానికీ రూపానికీ పెట్రోవిచ్ ఈ ఫ్రెంచి మాష్టర్ని చాలా మెచ్చుకున్నాడు. అతని పేరు డిఫోర్జి. డిఫోర్జి దగ్గర అతని విద్యార్హతలు, గుణగుణాలు తెలిపే యోగ్యతాపత్రా లున్నాయి. అతని నడవడి మంచిదని తెలిపే ఉత్తరాలున్నాయి. అందులో పెట్రోవిచ్ బంధువైన ఒకాయన దగ్గర నుంచి కూడా ఒకఉత్తరం తెచ్చాడు.

ఆయన దగ్గర నాలుగేళ్లు మాష్టారుగాపనిచేసినట్లు వ్రాసివుంది. పెట్రోవిచ్ ఈ ఉత్తరాలన్నీ చదివాడు. కాని ఫ్రెంచిమేష్టరు గురించి నచ్చనిదల్లా అతని పడుచు ప్రాయం. అతని యౌవన ప్రాయం బడిపంతులు వుద్యోగానికి పనికిరాదని గానీ; ఆ వుద్యోగానికి అవసరమైన ఓర్పు; అనుభవం 'అనే గుణాలు యౌవనంలో ఉండేవాళ్లకి ఉండవనిగానీ అతని ఉద్దేశం కాదు. అతనికి కొన్ని సందేహాలు వున్నాయి. అవన్నీ డిఫో ర్జికి స్పష్టంగా ముందే తెలియజెయ్యాలనుకున్నాడు. అయితే పెట్రోవిచ్‌కి ఫ్రెంచిభాష తెలీదు. పెద్దకూతురు మాషాకి ఫ్రెంచిభాష బాగావచ్చు. అంచేత మాషాని పిలిపించాడు. మాషా వచ్చింది.

'మాషా ఇలా రా! ఈ డిఫోర్జితో ఇలాగని ఫ్రెంచిలో చెప్పు' మీ కాగితాలన్నీ చూశాం. అంతా బాగానేవుంది. మిమ్మల్ని మేష్టారుగా నియమిస్తాం. కాని ఇక్కడ వుండే ఆడవాళ్లతో మాత్రం ఏ మాత్రం జోక్యం చేసుకోడానికి వీలులేదు; అలా చేస్తే మన కుక్కలచేత శిక్షింపచేస్తాను'- అని పెట్రోవిచ్ కూతురితో చెప్పాడు.

అలాగని డిఫోర్జితో చెప్పడానికి మాషా సిగ్గుపడింది. 'మీరు పెద్దమనిషి తరహాగా బుద్ధిమంతులుగా నడుచుకుం టారని మా నాన్నగారు నమ్ముతున్నారు.' అని గారంగ్గా డిఫోర్జికి చెప్పింది.

డిఫోర్జి మాషాకి నమస్కరించి "మీ అభిమానం సంపాదించలేకపోయినా; మీ గౌరవం పొందగలనని నా

నమ్మకం'' అని చెప్పాడు. ఆ మాటల్నే మాషా రష్యన్ భాషలో తండ్రికి చెప్పింది.

'చాలా సంతోషం' అన్నాడు పెట్రోవిచ్. 'కాని మన గౌరవంతోగానీ అభిమానంతోగాని అతనికేం పనిలేదని చెప్పు. 'సాషా' విషయమై తగినంత శ్రద్ధ తీసుకొని; వాడికి భూగోళశాస్త్రం, వ్యాకరణం చెప్పడమే అతని పని అని చెప్పు' అన్నాడు.

తండ్రి మాటలలోని పెడసరపు మాటలన్నిటినీ మృదువైన మాటలుగా మార్చి డిఫోర్జితో మర్యాదగా ఫ్రెంచి భాషలో చెప్పింది. తర్వాత పెట్రోవిచ్ అతన్ని అక్కడ నించి పంపేసి, అతనికి ఆ భవనంలోనే వున్న ఒక గది ఇచ్చి అక్కడే బస చెయ్యడానికి ఏర్పాటు చేసాడు.

మాషా ఆ ఫ్రెంచి యువకుణ్ణి ఏమంత లెక్క చెయ్యలేదు. తను జమీందారు బిడ్డననే గర్వంతో వుండడంవల్ల-తనే దృష్టిలో 'మాష్టారు' అంటే నౌకరో, పనివాడో అన్నట్టు చూసేది. నౌకర్లూ పనివాళ్లూ మాషా కంటికి మనుషులుగా కనిపించరు కాబోలు! డిఫోర్జి అంటే తను అట్టే ఇష్టపడేది కాదు. అతని తొట్రుపాటు, పిరికితనం గొంతుమార్పు ఆవిడికి నచ్చేవికావు. అతన్ని చాలాసార్లు కలుసుకునేదిగాని, అతని విషయంలో పట్టించుకోవడం అంత మంచి పనికాదని అనుకునేది. కాని తలవని తలంపుగా ఇంకోరకంగా అతన్ని గౌరవించటం నేర్చుకోవాల్సి వచ్చింది

పెట్రోవిచ్ ఎస్టేటులో ఎప్పుడూ కొన్ని ఎలుగుబంటి పిల్లల్ని పెంచడంకద్దు; అతని సరదాలలో ఇదొకటన్నమాట!

అవి చిన్న పిల్లలుగా వున్నప్పుడే వాటిని తన గదిలోకి తెప్పించుకొని, రోజూ ఒక గంటసేపు వాటితో ఆడుకునేవాడు. పిల్లుల్నీ కుక్కపిల్లల్నీ వాటిమీదికి ఉసికల్పి దెబ్బలాడించేవాడు. అవి పెరిగి పెద్దయాక వాటికి గొలుసుకట్టి వుంచేవాడు. అప్పుడప్పుడు ఇంటి కిటికీలదగ్గర వాటినుంచి మేకులు గుచ్చిన ఖాళీ సారా పీపాల్ని దొర్లించేవారు. ఎలుగుబంటి ఆ పీపాని ముట్టెతో వాసనచూసి జాగ్రత్తగా పంజాతో పట్టుకునేసరికి మేకు తగిలి గాయపడేది. బాధతో మండిపడుతూ పీపాను మరింత బలంగా పట్టుకుని ముందు దొర్లించేది. గాయాలు మరీ ఎక్కువై బాధ రెట్టింపయేది. దీంతో దానికి మరీ పిచ్చెత్తి కుయ్ కుయ్ మని పీపామీదపడి అరుస్తుండేది. ఒకొక్కప్పుడు రెండు ఎలుగుబంట్లని బండికి కట్టి, ఆ బండి మీద, ఇష్టమున్నా లేకపోయినా అతిథుల్ని కూర్చోబెట్టి, తోలించేవారు. పాపం అవి ఈడ్వలేక మొర్రోమని ఈడ్చేవి. అవి అలా అరుస్తుంటే ట్రొయెకురోవిచ్ ఆనందానికి హద్దువుండేది కాదు. ఈ సరదాలకేంగాని, ఇంకో సున్నితమైన సరదా వుంది; అది సవిస్తరంగా వర్ణించి చెప్పతగ్గది.

ఆవురావురుమని ఆకలివేస్తున్న ఒక ఎలుగుబంటిని ఒక ఖాళీ గదిలోపెట్టి గొళ్ళెంవేసి, గోడకు బిగించిన తాడుతో వాటిని కట్టేసి వుంచేవారు. సరిగ్గా ఆ గది ఎంత పొడవుందో ఆ తాడు పొడవుకూడా అంతే వుంటుంది. ఒకవేళ ఈ క్రూర జంతువు తిరగబడితే దానికి ఎదురుగావున్న గోడమూలనక్కివుంటేనే రక్షణ! ఎవరైనా కొత్తమనిషి వస్తే అతన్ని ఆ గది తలుపు దాకా తీసుకువెళ్ళి, పటాల్న అతన్ని ఆ ఎలుగుబంటి

వున్న గదిలోకి తోసేసి బయటగొళ్లెంపెట్టేవారు. పాపం ఆ దౌర్భాగ్యుడు ఈ ఒంటరి బొచ్చు జంతువుతో ముఖాముఖి నిలబడవలసి వచ్చేది. కోటు చిరిగిచిరిగి పీలికలై పోగా, రక్కు లతో గాయపడి రక్తాలు కారుస్తూ, ఆ దౌర్భాగ్యుడు రక్షణ స్థానమైన ఆ గోడమూలకిచేరి గోడకి అతుక్కుపోయి అలా మూడు గంటలసేపు నిలబడి, ఎదురుగా రెండడుగుల దూరంలో మెడకి కట్టిన తాడును బలంగా లెంచుకొని అతని మీదికి ఉరకడానికి ప్రయత్నిస్తూ, వెనక రెండు కాళ్ళమీద నించొని క్రూరంగా అరుస్తూ దుముకుతూ మహాభయం కరంగా కనిపించే ఆ ఎలుగుబంటివేపు కళ్ళప్పగించి చూడ వలసివచ్చేది. ఈ రష్యాదేశపు పెద్దమనిషి సరదాలంటే ఇంత గొప్పవి!

కొద్దిరోజుల తర్వాత పెట్రోవిచ్ కి తన భవనంలో 'డిపోర్జి' అనే ఫ్రెంచి పెద్దమనిషి ఒకడున్నాడని జ్ఞాపకం వచ్చే సరికి, అతనికికూడా ఈఎలుగుబంటిసరసం ఒకసారి రుచిచూపిం చాలని బుద్ధిపుట్టింది. వెంటనేడిపోర్జిని రప్పించి, అతన్ని చీకటి దారులగుండా తీసుకువెళ్లి ఎలుగుబంటిని వుంచిన గదిదాకా నడిపించి, గది తలుపులుతీసి, గభాలున అతన్ని ఆ గదిలోకి తోసేసి, బయట గొళ్ళెం పెట్టారు. ఇదంతా చూసి నివ్వెర పోయిన డిపోర్జికి ఎదురుగా ఎలుగుబంటి కనిపించింది గొలు సులతో కట్టివున్న ఆ ఎలుగుబంటి రెండుకాళ్ళమీద నిల బడి డిపోర్జిని చూడగానే క్రూరంగా అరుస్తూ గొలుసులీడ్చు కుంటూ అతనిమీదపడ్డానికి వచ్చింది. ఫ్రెంచి మనిషి కొంచె మైనా జంకలేదు. సరిగదా, తప్పించుకోవడానికి కూడా

ప్రయత్నించలేదు. ఎలుగుబంటి మీదికి వచ్చేసింది. డిపోర్జి జేబులోంచి చిన్న పిస్తోలుతీసి, ఎలుగుబంటిచెవి దగ్గర గురి పెట్టి పేల్చాడు. దాంతో ఎలుగుబంటి మూలుగుతూ కింద పడిపోయింది. అందరూ పరుగున వచ్చి తలుపులు తెరచుకొని లోపలికి ప్రవేశించారు. పెట్రోవిచ్ కూడా లోపలికి వచ్చి తన ఎగతాళి సరసం ఇలా మారినందుకు నిర్ఘాంత పోయాడు.

ఎలుగుబంటి సరసం గురించి ముందుగా డిపోర్జికి ఎవరు చెప్పారో అతని దగ్గర తూటాలుంచిన పిస్తోలు ఎందుకువుందో సంజాయిషీ యిమ్మని పెట్రోవిచ్ అడిగాడు. మాషాని పిలిపించి, ఆవిడచేత యీ మాటలు ఫ్రెంచిలో అడిగించాడు.

'నాకీ ఎలుగుబంటి గురించి ముందుగా ఎవరూ ఏమీ చెప్పలేదు. నా వృత్తిలో వున్నవాళ్లు ఇలాంటి అవమానాలు పొందకూడదు. అవమానాలు సహించే ఉద్దేశం నాకు లేదు కాబట్టి నా దగ్గర ఎప్పుడూ పిస్తోలు వుంటుంది.' అని డిపోర్జి ధైర్యంగా జవాబు చెప్పాడు.

అతని మాటలకి మాషా నివ్వెరపడి అతనివేపు కళ్లప్పగించి చూస్తూ డిఫోర్జి అన్నమాటలు తండ్రికి రష్యన్ భాషలో చెప్పింది. పెట్రోవిచ్ ఏమీఅనలేదు. ఎలుగుబంటిని తీసుకుపోయి, దాని చర్మం జాగ్రత్త చెయ్యమని నౌకర్లకు ఆజ్ఞాపించాడు. తర్వాత అక్కడ వున్న అందరితోనూ ఇలా అన్నాడు; 'అతను చాలా మంచివాడు. పిరికివాడుకాదు. నేను ధైర్యంగా చెప్పగలను.' ఆ రోజునుంచి పెట్రోవిచ్,

డిపోర్జి అంటే చాలా ఇష్టంగా చూసేవాడు. మళ్లీ ఎప్పుడూ అతన్ని పరీక్ష చెయ్యడానికి ప్రానుకోలేదు.

ఈ సంఘటన మాషాని ఆకర్షించినంతగా ఇంకెవ్వరినీ ఆకర్షించలేదు. చచ్చిపడున్న ఎలుగుబంటి పక్క ధైర్యంగా నించొని కచ్చితంగా జవాబిచ్చిన డిపోర్జి రూపం ఆవిడ మనస్సులో అలా నిలిచిపోయింది. ధైర్యం, హోదా, ఆత్మ గౌరవం అనేవి ఒక్క ధనవంతులలోనే వుండవని ఆమె కిప్పుడు తెలిసింది. ఆరోజు నుంచి మాషా డిపోర్జిని రోజు రోజుకీ ఎక్కువ గౌరవంగాచూడడం మొదలుపెట్టింది. వాళ్ళిద్దరికీ బాగా స్నేహం కలిసింది. మాషాకి చక్కని కంఠం వుంది. చాలా చక్కగా పాడుతుంది. డిపోర్జి మాషాకి మంచి మంచి సంగీతపాఠాలు చెప్పేవాడు. ఒకరి నొకరు ఎవరికి తెలియకుండా వాళ్లు ప్రేమిస్తున్నారని మీరు గ్రహించి వుంటారిప్పుడు.

## 9

ఆ పండగ రోజున అతిథులంతా రావడం మొదలు పెట్టారు. కొందరు భవనంలోనూ కొందరు ప్రక్క గదుల్లోనూ, కొందరు ఆ భవనం మేనేజరు ఇండ్లలోనూ, అర్చకుల ఇండ్లలోనూ మరికొందరు పెద్దరైతుల ఇండ్లలోనూ బస చేసారు. గుర్రాలశాలలన్నీ అక్కడికి వచ్చిన బగ్గీలగుర్రాలతో నిండివున్నాయి. ఇంటి ఆవరణలు, పాకలుకూడా అన్ని రకాల బండ్లతోనూ నిండివున్నాయి. తొమ్మిదిగంటల

కల్లా ఉదయపు ప్రార్థనలు జరగడంకోసం చర్చి గంటలు వినిపించాయి. అందరూ పెట్రోవిచ్ కొత్తగా ఇటుకలతో కట్టించిన చర్చికి బయల్దేరారు. ప్రతి సంవత్సరం పెట్రోవిచ్ ఆ చర్చికి బహుమతులు సమర్పిస్తుంటాడు. చర్చికి వచ్చిన వాళ్ళలో చాలామంది గొప్ప గొప్ప వాళ్ళుండడంవల్ల సామాన్య రైతులికి చర్చిలో స్థలంచాలక బయటనే నించో వలసి వచ్చింది. పూజలు ఇంకా అప్పటికి మొదలు కాలేదు. పెట్రోవిచ్ కోసం ఎదురుచూస్తున్నారు. ఆరుగుర్రాల బగ్గీ మీదబయల్దేరి పెట్రోవిచ్ మాషాతోకూడా చర్చికివచ్చారు. అందరి కళ్ళూ, మాషామీదే పడ్డాయి. పురుషులు ఆమె అందాన్ని పొగిడారు. స్త్రీలు ఆమెధరించిన విలువైన దుస్తుల్ని రెప్పవాల్చకుండాచూస్తున్నారు. పూజలు ప్రారంభ మయ్యాయి. మామూలు ప్రార్థన గీతం, కీర్తనలు పాడే చోటు నుంచి వినబడింది. పెట్రోవిచ్ ఎటు ప్రక్కా చూడ కుండా తలవంచుకు తనుకూడా మెల్లగా ప్రార్థన గీతం అందు కున్నాడు. అర్చకుడు "ఈ చర్చి స్థాపకుడు–" అని అంటుం డగా తల మరీ గర్వంగా వంచి తన హుందా కనపరిచాడు.

ప్రార్థన ముగిసింది. మొట్టమొదట పెట్రోవిచ్ 'సిలువ' దగ్గరికి వెళ్ళాడు. తర్వాత తతిమా వారంతా ఒక్కొక్కరుగా వెళ్ళి సిలువకు నమస్కరించారు. పిమ్మట అందరూ పెట్రో విచ్‌కి నమస్కరించారు. ఆడవాళ్ళంతా మాషా చుట్టూ చేరారు. చర్చినించి బయటికి వచ్చాక; పెట్రోవిచ్ అక్క డున్న వారందరినీ మధ్యాహ్నం భోజనాలకి రమ్మని పిలిచి, బగ్గీ ఎక్కి వెళ్ళిపోయాడు. అతిథులు ఎవరి బళ్ళమీద వారు

బయల్దేరి పెట్రోవిచ్‌ని అనుసరించారు. గదులన్నీ అతిథు లతో క్రిక్కిరిసి వున్నాయి. కొత్తకొత్త అతిథులు అలా వస్తూనే వున్నారు. ఎడతెరపిలేకుండా అసలు వాళ్లు పెట్రో విచ్ దగ్గరికి గుంపులలోంచి వెళ్ళడానికే కష్టమయింది. ఆడ వాళ్ళు ఖరీదైన దుస్తులు వేసుకుని, ముత్యాలహారాలూ, వజ్రాలహారాలూ బయటికి అగపడేలా ధరించి అర్ధచంద్రా కారంగా అమర్చబడిన సోఫాలలో వుండాగా కూర్చు న్నారు. బల్లలమీద రకరకాల మాంసాలూ; వోడ్కా—సారా వడ్డించి వున్నాయి. పురుషులు వాటి చుట్టూకూర్చుని వాళ్ళలో వాళ్ళు ఏవేవో వాదించుకుంటున్నారు. పెద్దహాల్లో బల్లచుట్టూ ఎనభై మంది ముఖ్యులకి భోజనాలు ఏర్పాటు చేస్తూ; నౌకర్లు సీసాలు ద్రాక్షసారాలు బల్లమీద సర్దడం లోనూ; బల్లమీద పరచిన బట్టలు సాపుగా అమర్చడం లోనూ హడావుడిగా వున్నారు. ఆఖరికి బట్లరు "వడ్డనపూర్తి అయింది" అని చెప్పాడు. మొట్టమొదట పెట్రోవిచ్ కుర్చీలో కూర్చున్నాడు. తర్వాత ఆడవాళ్లు వచ్చి ఏదో అదిక్యత వాళ్ళకు వున్నట్టుగా అతి పవిత్రంగా వాళ్ల చోటుల్లో కూర్చున్నారు. లేడి పిల్లల మాదిరిగా పడుచు అమ్మాయి లంతా గుంపుగావచ్చి ఒకరి తర్వాత ఒకరు కూర్చున్నారు. వాళ్ళకి ఎదురుగా మగవాళ్లు కూర్చున్నారు. టేబిలు చివర ఫ్రెంచి మాష్టరు డిఫోర్జి; అతని ప్రక్క శిష్యుడు "సాషా" కూర్చున్నారు

వడ్డనచేసేవాళ్ళు—అతిథుల హోదానిబట్టి వరసగా ఒకళ్ళ తర్వాత ఒకరికి వడ్డిస్తున్నారు. వాళ్ళ హోదా విష

యంలో వాళ్ళకి అనుమానం తోచినప్పుడల్లా; వాళ్ళముఖా లను బట్టి మనిషి హోదాలను తెలుసుకుంటూ వర్ధిస్తూ వచ్చారు. అలా తెలుసుకోవడంలో పొరపాటు మాత్రం పడలేదు. అతిథుల బాతాఖానీ సందడిలో ప్లేట్లు; గరిటల చప్పుళ్లు కలిసిపోయాయి. పెట్రోవిచ్ ఒక్కసారి బల్లంతా కలియజూసి మహాదానపురుషులు పొందే సంతృప్తి పొంది సంతోషించాడు... అంతలో అప్పుడే వచ్చిన ఒక ఆరు గుర్రాలబండి ఆగిందీ.

"ఎవరది?" అని ప్రశ్నించాడు పెట్రోవిచ్.

"ఆంటన్ పఫ్నూటిచ్;" అని చాలామంది ఒకేసారి జవాబిచ్చారు. తలుపులు తెరిచారు. ఇంతలో ఏభై సం వత్సరాల వయస్సుండే ఆంటన్ పఫ్నూటిచ్ వచ్చాడు. చాలా లావుగా వున్నాడు. ముఖం గుండ్రంగా స్ఫోటకం మచ్చలతో నిండివుంది. గడ్డం దగ్గర మూడుచోట్ల లొత్తలు పడ్డ మూడుగడ్డాలున్నట్టు కనిపిస్తోంది. సరాసరి భోజనాలి గదిలోకి హడావుడిగా వచ్చి, ఆలస్యానికి మన్నించమని కోరుతూ చిఱునవ్వులతో నమస్కరించి ప్రవేశించాడు.

"ఈ కుర్చీ ఖాళీగావుంది-ఇలారా ఆంటన్ పఫ్నూ టిచ్! కూర్చో! ఉదయం మాతోబాటు ప్రార్థనకి రాలేదు; ఇప్పుడు భోజనానికి ఆలస్యంగా వచ్చావు. నువ్వు భక్తుడివీ! భోజనప్రియుడివీ! అయినప్పటికీ ఇలా చెయ్యడంలో నీ ఉద్దేశ మేమిటో చెప్పు"

ఆంటన్ పఫ్నూటిచ్ 'క్షమించండి' అని, ఆకుపచ్చని తన దుస్తుల్లోని గుండీ కన్నానికి రుమాలు కొన బిగించి

భోజనం ముందు కూర్చున్నాడు.

'తప్పు నాదికాదు; వేళవుండగానే బయల్దేరాను. కాని పది బారల దూరమైనా వెళ్ళామో లేదో బండి ముందటి చక్రాలలో ఒకటి రెండు ముక్కలుగా విరిగిపోయింది. అదృష్టవశాత్తూ ఊరి నుంచి చాలా దూరం రాలేదు. కాని మా పనివాళ్లు కమ్మరివాణ్ణి వెదికి తెచ్చి అంతా సరిచేశారు. ఇది మూడు గంటలు పట్టింది. ఏం చేస్తాను మరి? అప్పుడు బయల్దేరాను. దగ్గర దారి అయినప్పటికీ కిస్తెనెవ్కా తోటల్లోంచి రావడానికి భయంవేసింది. అందుకని చుట్టూతిరిగి రావలసి వచ్చింది ...'' అన్నాడు పఫ్నూటిచ్.

''అయితే నువ్వు పిరికి వాడవన్నమాట? ఎందుకని భయపడ్డావ్?'' అని ప్రశ్నించాడు పెట్రోవిచ్.

''భయపడ్డమా? పెట్రోవిచ్? ఇంకెవరు? దుబ్రోవ్‌స్కీ అంటే ఎవరు భయపడరు? మనం ఎక్కడున్నామో తెలుసుకోకముందే అతని పట్టులో చిక్కుకుంటాం. దుబ్రోవ్‌స్కీ అంటే ఏమిటో ప్రతివారికీ తెలుసు. బాటసారుల్ని ఎవర్నీ అతను విడిచిపెట్టడు. నాలాంటి వాడంటే అతనికి మరీ పగ!'' అన్నాడు పెట్రోవిచ్.

''ఏమిటో ఆ భేదం?'' అనడిగాడు పెట్రోవిచ్.

'ఆ భేదమేమిటో మీకు బాగా తెలుసు. చచ్చిపోయిన దుబ్రోవ్‌స్కీమీద తమరు పెట్టిన కేసే కారణం! మీ అభిమానం కోసమని నేనానాడు అంతరాత్మకి విరుద్ధంగాకూడా మీ తరఫున మాట్లాడి, కిస్తెనెవ్కా ఎస్టేటును దుబ్రోవ్‌స్కీ అక్రమంగా చట్టవిరుద్ధంగా అనుభవిస్తున్నాడని,

మీ అభిమానంవల్లనే అతను దానిని అనుభవిస్తున్నాడని నేను సాక్ష్యం చెప్పలేదా? చచ్చిపోయిన దుబ్రోవ్స్కీ నాతో పగ పట్టి పగ తీర్చుకుంటానని శపథం చేశాడుకూడా! అతని ఆత్మ శాంతించుగాక! ఇప్పుడతని కొడుకు తండ్రి శపథాన్ని తప్పకుండా నెరవేరుస్తాడు. ఇంతవరకూ దేవుడు నన్ను కాపాడాడు. వాళ్లు ఇంతవరకు నా ధాన్యపుకొట్లు మాత్రం దోచుకున్నారు. కాని ఏదో ఒకరోజు మా యింటిలో కూడా పడతారు. చూడండి అంత పనీజరుగుతుంది".

"అవును. మీ యిల్లు దోచుకోదగ్గ యిల్లని భగవంతుడికి తెలుసు. నీ దగ్గరున్న రత్నాలపెట్టి ఒక్కటేచాలు".

"ఇంకేంలేదు. ఒకప్పుడు నా రత్నాలపెట్టె నిండుగా వుండేదిగాని ఇప్పుడది ఖాళీ అయిపోయింది"

'అబద్ధాలెందుకులే పోవయ్యా! నీ సంగతి మా అందరికీ తెలిసిందే. అసలు గడించిన డబ్బు ఏంచేస్తావో తెలీదు. అతిథులనన్నా పిలువవు-రైతుల రక్తం కార్పించి వదుల్తావు. డబ్బుకూడబెట్టడం తప్ప మరో ఆలోచనేలేదు. ఏం బ్రతుకు లెద్దూ!'

'మీ రెప్పుడూ ఎగతాళి చేస్తూనే వుంటారు, కాని నిజానికి మేము నాశనమైపోయాము, యథార్థం నమ్మండి' అంటూ భోజనానికి ఉపక్రమించారు చేపముక్కలు నోట్లో వేసుకుంటూ పప్నూటిచ్.

• పెట్రోవిచ్ అతన్ని మరేమీ అనకుండా కొత్తగా వచ్చిన పోలీసుపత్తేదారు వేపు దృష్టి మరలించాడు. ఈ

కొత్త పత్తేదారు ఫ్రెంచి మాష్టరైన డిఫోర్జి ప్రక్క కూర్చు న్నాడు. ఇంతవరకూ అతను అతిథిగా ఇక్కడికి రాలేదు.

'అన్నట్టు పెద్దపత్తేదారుగారూ! మీరేకదూ దుబ్రో వుస్కీని పట్టుకోవాలను కుంటున్నారు?' అని పెట్రోవిచ్ అతన్ని ప్రశ్నించాడు.

పత్తేదారు సిగ్గుపడి, సలాంచేసి, నవ్వి ఆఖరికి "ప్రయ త్నిస్తామండి" అన్నాడు.

'హుం... ప్రియత్నిస్తారా ఇంకా? చాలా కాలం నించి ఎంతోమంది ప్రయత్నిస్తూనే వున్నారు. కాని ఇంత వరకు ఫలితం ఏదీ కన్పించలేదు. ఇంతకీ అతన్ని మీరెందుకు పట్టుకుంటారులేండి. దుబ్రోవుస్కీ దొంగతనాలంటే మీ పోలీసువాళ్ళకి బంగారం గని వంటివి. ప్రయాణాలు, విచా రణలు, గుర్రాల సరఫరా ఇదంతా మీ జేబుల్లో కొచ్చే కదూ? మీకు మేలుచేసేవాణ్ని మీ రెందుకు నాశనం చేస్తారు? ఇది వాస్తవమేనా పత్తేదారూ?" అని అడిగాడు పెట్రోవిచ్.

"వాస్తవమేనండి" అన్నాడు పత్తేదారు తొట్రుపడుతూ, ఏం చెప్పాలో తెలీక. అతిధులంతా గొల్లున నవ్వారు.

"ఈ పత్తేదారు నిజాయితీకి నేను చాలా మెచ్చుకుం టున్నాను; కాని తారాస్ అలెగ్సియేవిచ్ని మనం పోగొట్టు కోవడం చాలా విచారకరం. అతన్ని మంటల్లో కాల్చి చం పకపోతే ఈ జిల్లా అంతా బాగుపడేది; అయితే దుబ్రోవుస్కీ

గురించి తాజావార్త లేమిటి! ఇప్పుడు అతను ఎక్కడ వున్నట్టు?" అని పెట్రోవిచ్ పత్తేదార్ని అడిగాడు.

మా యింట్లో కనిపించాడు గత మంగళవారం నాతో భోజనంకూడా చేశాడు..." అని ఒక స్త్రీ చెప్పింది. ఆమె పేరు 'అన్నాసవిషాన్గ్లొబోవా' ఆవిడ భర్త చచ్చిపోయాడు. అమాయకురాలు; జాలిగుండె అని అందరికీ తెలుసు. ఆవిడ ఇలా చెప్పేసరికి అందరికళ్లూ అటువేపే తిరిగాయి. ఇంకా ఆమె ఏం చెబుతుందో అని అందరూ ఆత్రుతగా ఆమె వేపు కళ్ళప్పగించి చూస్తున్నారు. ఆమె ఇలా చెప్పింది.

'మూడు వారాల క్రితం మా అబ్బాయి వాన్యాషాకి డబ్బు పంపడానికి గాను మా గుమస్తా చేతికి డబ్బిచ్చి రహదారి ఆఫీసుకు పంపించాను. మా అబ్బాయిని కష్టపెట్టడం నా కిష్టంలేదు. నా మనస్సందుకు వొప్పుకోలేదు. అదీగాక పటాలంలో ఆఫీసరు వుద్యోగం చేస్తున్నాడూ అంటే దర్జాగా కనిపించాలికదా! నా శక్తికొద్దీ నేను అతనికి డబ్బు పంపిస్తుంటాను. ఆవాళ రెండువేల రూబుల్లు పంపిస్తున్నాను. అయితే దుబ్రోవుస్కీమాట నాకు జ్ఞాపకం రాకపోలేదు. కాని ఊరుకూడా దగ్గరలోనే వుందికదా, అంతాచూస్తే ఇక్కడికి ఏడుమైళ్లేకదా దూరం; ఇంతలో ఏమవుతుందిలే భగవంతుడు లేడా అనుకుని ధైర్యంగా గుమస్తాని పంపాను. కాని సాయంకాలమయ్యేసరికి మా గుమస్తా పాలిపోయిన ముఖంతో చినిగిన పీలికలతో కాళ్ళీడ్చుకుంటూ తిరిగి వచ్చాడు. నేను ఆందోళనపడి, "ఏం జరిగింది, ఏం అలా వున్నావు!" అని అడిగాను. ఇంకేముంది! 'అమ్మగారూ!

ఏం చెప్పను, ఆ దుర్మార్గులు మీదపడి దోచుకున్నారు. నన్ను చంపెయ్యాలనికూడా అనుకున్నారు. దుబ్రోవ్స్కీ కూడా వాళ్ళతో వున్నాడు. మొరపెట్టుకుంటే అతను జాలి పడి నన్ను విడిచిపెట్టాడు. కాని వాళ్ళు నా దగ్గరున్న సామ్మంతా లాక్కున్నారు. బండీ, గుర్రంకూడా లాక్కు న్నారు. చావుతప్పి కన్నులొట్టపోయి ఇలా వచ్చానమ్మా' అని చెప్పాడు. నేను నిర్ఘాంతపోయాను. అయ్యో భగవం తుడా! మా అబ్బాయి సంగతేంగాను? చేసేదేమీలేక మా అబ్బాయికి ఒక వుత్తరం రాసి జరిగిందంతా వ్రాసి పంపాను.

ఒకటి రెండువారాలు గడిచాయి. ఒకరోజు మా యింటి ముందు ఏదో బండి ఆగింది. ఎవరో వుద్యోగి నన్ను చూడాలని వచ్చాడు. లోపలికి రమ్మన్నాను. ఆ ఉద్యోగి లోపలికి వచ్చాడు. ముప్పైఅయిదు సంవత్సరాలుంటాయి. చామనచాయ శరీరం. నల్లని జుత్తు; గడ్డం, కూడా వుంది. అంతా ఒకపెద్ద సేనానిలావున్నాడు. మా ఆయనా, ఆ వచ్చి నాయనా యుద్ధంలో స్నేహితులమని చెప్పాడు. నే నిక్కడ వున్నానని తెలిసి మిత్రుడిభార్యకదా అని దారమ్మట పోతూ ఒకసారి చూడాలని దిగివచ్చానన్నాడు. అతనికి భోజనం పెట్టి అవీ యివీ మాటాడుకున్నాక దుబ్రోవ్స్కీ విషయం వచ్చింది. అప్పుడు నేను జరిగిన విషయం చెప్పాను. అతనికి ఇదివిన్నాక పట్టరాని కోపంవచ్చింది 'ఇది చాలా వింతగా వుందే-దుబ్రోవ్స్కీ ఎవరినిపడితే వాళ్ళని దోచు కోడనీ, ఎవరో కొద్దిమంది ధనవంతుల్ని మాత్రం పట్టుకుం టాడనీ, అయినా డబ్బంతా దోచుకోడనీ, ఏదో తనకి

కావల్సినంత మాత్రం తీసుకుని వదిలేస్తాడనీ నేను విన్నాను. హత్యలు చేస్తాడని అతనిని ఎవరూ నిందించడంలేదు. ఇందులో ఏదో మోసం వుంది. ఏదీ మీ గుమస్తాని పిలిపించండి' అన్నాడతను నేను గుమస్తాని రప్పించాను. అతన్ని చూచిన మరుక్షణమే గుమస్తా తొట్రుపడ్డాడు. అతను గుమాస్తాని చూసి, 'ఏంవోయ్! దుబ్రోవుస్కీ నిన్నేవిధంగా దోచుకున్నాడో, నిన్నెలా హింసించాడో చెప్పు' అని అడిగాడు. గుమస్తా వణికిపోతూ అతని పాదాలమీద పడ్డాడు. "మన్నించడయ్యా! బుద్ధి గడ్డితిని అబద్ధమాడాను" అని వేడుకున్నాడు. "అయితే మంచివాడవనిపించుకొని యథార్థంగా ఏం జరిగిందో అమ్మగారితో చెప్పు వింటాను" అన్నాడాయన. గుమస్తా వణుకు ఇంకా తగ్గలేదు. 'దుబ్రోవు నీకు ఎక్కడ కన్పించాడు? అని మళ్లీ అతనడిగాడు. 'ఆ రెండు పనస చెట్లున్నాయే-అక్కడండి' అన్నాడు గుమస్తా ఇంకా వణుకుతూ. 'నిన్ను చూసి ఏమన్నాడు?' అని అడగ్గా 'నన్ను చూసి నే నెవరిదగ్గర పని చేసేదీ, ఎక్కడికి వెళ్లేదీ, ఎందుకు వెళ్లేదీ చెప్పమన్నారండి. తర్వాత నా దగ్గరవున్న వుత్తరం, డబ్బూ అడిగారండి. నేను భయపడి ఆ వుత్తరమూ డబ్బూ అతనికిచ్చేశానండి' అని గుమస్తా చెప్పాడు. అప్పుడు దుబ్రోవుస్కీ ఏమన్నాడని మళ్ళీ అతను గద్దించి అడగ్గా, 'మన్నించండి బాబూ, దుబ్రోవుస్కీ తిరిగి ఆ వుత్తరమూ డబ్బూ నాకిచ్చేసి నా దారిని నన్ను పొమన్నారండి' అని చెప్పాడు. "అయితే నువ్వేం చేశావు' అని అతను కోపంగా అడిగిన మీదట, వాడు నసిగాడు; మన్నించమన్నాడు. 'సరే నీ పని

పడతాను ఉండు' అని వాణ్ణి బెదిరించి ఆతను నా వేపు తిరిగి "అమ్మా, ఈ దొంగ వెధవ పెట్టెలు అవీ వెదికించండి. వీడిని నా కప్పగిస్తే వీడికి తగిన పాఠం బోధపరుస్తాను. డుబ్రోవుస్కీ కూడా ఒకప్పుడు పటాలంలో ఆఫీసరుపని చేసిన వాడే గనక తోటి ఉద్యోగికి అతనెప్పుడూ హానిచెయ్యడమ్మా" అన్నాడు. అప్పుడు అతనెవరో నేను ఊహించాను. అంచేత అతనితో మరి మాటాడలేదు. గుమస్తా పెట్టెలో డబ్బు దొరికిపోయింది. బండివాడుగుమాస్తాని త్రాళ్ళతోకట్టి బండిలో పడేశాడు. భోజనంచేశాక ఆ పెద్దమనిషి గుమస్తాని తనతోకూడా తీసుకుపోయాడు. ఆ మర్నాడు అడవిలో ఒక మర్రిచెట్టుకి కట్టివెయ్యబడి చావునెబ్బలుతిన్న గుమాస్తా కనిపించాడు."

అన్నాసవిష్నా ఈ కథ చెబుతుంటే అందరూ కొయ్య బొమ్మల్లా వింటూ కూర్చున్నారు. అందులో పడుచు ఆడవాళ్ళు మరీన్నీ, చాలా మంది డుబ్రోవుస్కీని ఒక కథా నాయకుడిగా వాళ్ళ మనసుల్లో భావించుకుని అతన్ని పొగుడుతున్నారు. అందులోనూ, అనేక సాహస వీరుల ఫ్రెంచి కథలు చదివి, కలలు కంటుండే మాషాకి డుబ్రోవుస్కీ అంటే సాహస చోరసింహం అనిపించింది.

పెట్రోవిచ్ మాత్రం ఈ కథ నమ్మలేదు. "అయితే అన్నాసవిష్నా! నిజంగా నీ యింటికి వచ్చినతను డుబ్రోవుస్కీ అనే నీ నమ్మకమా? వట్టిది నువ్వు బాగా పొరబడ్డావు. నీ యింటికి వచ్చినతను ఎవరో తెలీదుగాని అతడు మాత్రం

డుబ్రోవ్‌స్కీ కాడని నేను ఖచ్చితంగా చెప్పగలను" అన్నాడు.

"అతను డుబ్రోవ్‌స్కీ కాడంటారా? మరి దారులు తిరిగి బాటసారుల్ని పట్టుకొని వాళ్ళని సోదా చేసేదింకెవరు? అని అన్నాసవిష్నా అడిగింది.

"ఆది చెప్పలేను గాని అతను మాత్రం డుబ్రోవ్‌స్కీ కాడంటున్నాను. అతన్ని చిన్నప్పుడు నేను చూశాను. అతని జుట్టు ఇప్పుడు నల్లబారిందేమో గాని అప్పుడుమట్టుకు ఉంగరాలజుట్టుతో అందంగా వుండేవాడు. నేనెరిగినంత మట్టుకు–డుబ్రోవ్ మా మాషాకంటె అయిదేళ్లే పెద్ద కాబట్టి అతనికిప్పుడు ఇరవైమూడేళ్లుంటాయి. అంతేగాని నువ్వు చెప్పినట్టు ముప్ఫయిఅయిదేళ్లుండవు" అన్నాడు పెట్రోవిచ్.

"ముమ్మాటికీ మీరన్నది నిజం," అన్నాడు పత్తేదారు, 'నా దగ్గర డుబ్రోవ్‌స్కీ గుర్తులు వ్రాసిన జాబితా కాగితం జేబులోవుంది. అందులో డుబ్రోవ్‌స్కీ వయస్సు ఇరవైమూడేళ్ళని ఖచ్చితంగా వ్రాసివుంది.'

'ఓహో–ఇంకేం ఏదీ ఆ జాబితాలో వ్రాసిన పోలికలు చదివి వినిపించు వింటాం. అతనెలా వుండేదీ కనీసం తెలుసుకుంటాం. ఒకవేళ దేవుడు మేలుచేసి డుబ్రోవ్ మా కంట బడితే తప్పించుకోలేడు' అంటూ పెట్రోవిచ్ చెప్పాడు.

పత్తేదారు జేబులోంచి ఒక మాసిన కాగితం తీసి, సగర్వంగా కాగితం మడతలు విప్పి, రాగధోరణిలో చదవడం మొదలు పెట్టాడు.

"వ్లాడిమర్ దుబ్రోవుస్కీ ఆనవాళ్ళు: అతని పాత నౌకర్లు ఇచ్చిన సాక్ష్యాన్నిబట్టి తయారుచేయబడింది.

'వయస్సు ఇరవైమూడు సంవత్సరాలు. సామాన్యమైన పొడవు. గడ్డంలేదు. బాగా క్షవరం చేసుకున్న గడ్డం. గోధుమరంగు కళ్లు, అందమైనజుట్టు తిన్నని ముక్కు. ప్రత్యేకమైన పోలికలు ఏమీ లేవు.'

'అంతేనా?' అన్నాడు పెట్రోవిచ్.

'అంతేనండి', అని పత్తేదారు తిరిగి కాగితం మడత పెట్టి జేబులో పెట్టుకున్నాడు.

'నిన్ను చాలా మెచ్చుకున్నాం, పత్తేదార్! మీ దగ్గర ఒక రికార్డు ఉంచుకున్నారన్నమాటే? ఈ ఆనవాళ్ళని బట్టి దుబ్రోవుస్కీని పోల్చుకోవడం ఎంత సులువో తెలుస్తూనే వుంది. అయితే మనలో ఎవరికి సామాన్యమైన పొడవు లేదు? ఎవరికి అందమైన జుట్టులేదు? గోధుమరంగుకళ్ళూ, తిన్నని ముక్కూ, మనలో ఎవరికిలేవు? సెబాష్. మూడు గంటలసేపు నువ్వు డుబోవుతో మాటాడినా అతని ఆనవాళ్ళు తెలుసుకోలేవని పందెంవేసి చెప్పగలను. ఈ వుద్యోగస్థులంతా వట్టి మట్టి బుర్రలనాలి.' అని పెట్రోవిచ్ ఎగతాళి చేశాడు.

పత్తేదారు పల్లెత్తు మాటన్నా అనకుండా చల్లగా కూర్చుని బాతుమాంసం, కేబిజికూర ఆరగించడం మొదలు పెట్టాడు. మధ్య మధ్య నౌకర్లు ఖాళీ అయిన గళాసులు మళ్లీ మళ్లీ నింపుతున్నారు. కాకసియా మేలురకం ద్రాక్షసారా బుడ్లు కొల్లలుగా రాసాగాయి. సీసా బిరడాలు పెద్ద చప్పు

ళ్ళతో ఎగురుతున్నాయి. ఆ వాసనలు తగిలేసరికి అందరి నోళ్ళూ వూరాయి. దాంతో బాతాఖానీ మరింత సందడిగా, సంతోషంగా తయారయింది పెట్రోవిచ్ మళ్ళీ మాట్లాడ్డం మొదలుపెట్టాడు.

'అంతా బాగుంది గాని చచ్చిపోయిన 'తారాస్ అలెగ్జేవిచ్' లాంటి పత్తేదారును మళ్ళీ మనం చూడ బోము. అతనెప్పుడూ పొరపాటన్నది పడేవాడు కాడు. ఎవరూ తప్పించుకోలేక పోయేవారు. అతను కనుక్కోలేని సంగతులే వుండేవి కావు. చాలా మంచివాడు పాపం! నిష్కా రణంగా మంటల్లో బలైపోయాడు. అతనే బ్రతికివుంటే ఈ దొంగల ముఠాలో ఒక్కడుకూడా అతని చేతుల్లోంచి బయట పడ్డమే! అందర్నీ పట్టుకుతీరేవాడు. డుబ్రోవుకూడా తప్పిం చుకోలేకపోయేవాడు. ఇంత స్వేచ్ఛగా తిరిగేవాడు కాడు. తారాస్ అలెగ్జేవిచ్! డుబ్రోవు సొత్తు తీసుకున్నా తీసు కుంటాడేమోగాని అతన్ని మాత్రం విడిచిపెట్టేవాడు కాడు. పాపం అలాంటి మేధావంతుడు చచ్చిపోయాడు నేనీ విష యంలో ఎందుకు పూనుకోవాలి ?గాని పూనుకుంటే ఎంత సేపు? ఈ దొంగల్ని పట్టడానికి నా నౌకర్లు చాలు. ఒక ఇరవై మందిని ఆయుధాలిచ్చి పంపితేచాలు. దొంగల ముఠా పటాపంచలయిపోతుంది. వాళ్ళలో ఒక్కడూ పిరికిపంద లేడు. ఒక్కొక్కడూ ఒక్కొక్క ఎలుగుబంటిని ఎదుర్కోగలడు'

ఎలుగుబంటి అనేసరికి 'మీ ఎలుగుబంటి ఎలా వుంది' అని ఆంటన్ పఫ్నూటిచ్ అడిగాడు. అతనుకూడా చాలా

మాష్టు ఆ ఎలుగుబంటి సరసం చూసినవాడే. అంచేత బొచ్చు జంతువును అతనెప్పుడూ మరచిపోలేరు.

'(బూ)యిన్ చచ్చిపోయింది', పెత్రోవిచ్, 'శత్రువు చేతిలో చిక్కి చాలా దారుణంగా చచ్చిపోయిండి,' అని డిఫోర్జి వేపు చూపించి, 'ఇదుగో ఆ వీరుడు-ని శత్రువుని సంహరించిన వీరుడు-బహుశా నీకు జ్ఞాపకం వుండే వుంటుంది', అని ఎగతాళి చేశారు పఫ్నూటిచ్ ని.

'జ్ఞాపకం లేకేం,' అంటూ పఫ్నూటిచ్ తలమీద మచ్చ తడుముకున్నాడు. 'ఎలా మర్చిపోతానండీ – అయితే పాపం యిన్ చచ్చిపోయిందన్నమాట! అయ్యో చాలా విచారకరమైన విషయం–నిజంగా నాకు చాలా విచారంగా వుంది. అదెంత సరదాగా వుండేది! అంత తెలివైన ఎలుగుబంటి మరెక్కడా వుండదు. ఇంతకీ ఈ అయ్యవారు దాన్నెందుకు చంపారో?' అని అడిగాడు.

పెత్రోవిచ్ (ఫ్రెం)చి మాష్టారు చేసిన ఘనకార్యం గురించి, జరిగిన కధంతా అతిశయంగా చెప్పడం మొదలు పెట్టాడు మిగతావాళ్ళందరి ముందూ త[న] గొప్పతను చెప్పుకుంటూ తన హోదా అందరూ గు_ర్తించేలా చేశాడు. అతనలా చెబుతుంటే అందరూ (బూ)యిన్ చావు గురించిన కధ కుతూహలంగా వింటూ డిఫోర్జి వేపు విస్మూరంగా చూడసాగారు. బొతాఖాసి చివరికి తన విషయానికి మళ్లిందని, తన ధైర్యం గురించి మాటాడుకుంటున్నారని డిఫోర్జి గు_ర్తించినట్టే లేదు. సాషాతో ఏదో చెప్పుతున్నాడు, కుదురుగా కూర్చుని.

భోజనాలు ముగిసేసరికి మూడు గంటలు పట్టింది. యజమాని ఒడిలోని రుమాలు తీసి బల్లమీద వుంచాడు. అందరూ లేచి మరో గదిలోకి వెళ్లారు. కాఫీ, చీట్లపేకలు, మళ్లీ తాగడానికి సారాబుడ్లు వీళ్ళకోసం అక్కడ బల్లమీద ఎదురుచూస్తున్నాయి.

# 10

రాత్రి ఏడు గంటలయ్యేసరికి కొంతమంది వెళ్లిపోవాలనుకున్నారు. దాని యజమాని మస్తుగా త్రాగిన మైకంలో తలుపులు మూయించి తెల్లవారిందాకా ఈ భవనం నుండి ఒక్కడైనా బయటికి వెళ్ళడానికి వీలులేదని ఆజ్ఞాపించాడు. ఇంతలో సంగీతం వినిపించింది. నాట్య మందిరం తలుపులు తెరుచుకున్నాయి. నాట్యం ప్రారంభమయింది. ఒకమూల పెట్రోవిచ్ తన ముఖ్యస్నేహితులతో కూర్చుని, గ్లాసు తర్వాత గ్లాసు ఖాళీచేస్తూ, పడుచువాళ్లు సరదాగా నాట్యం చేస్తుంటే మెప్పుగా తల ఆడిస్తున్నాడు. వయస్సుమళ్లిన ఆడవాళ్లు చీట్లపేక ఆడుతున్నారు. అర్హత గల పురుషులుచుట్టూ వున్నప్పటికీ; అక్కడ ఆడవాళ్ళ సంఖ్యకంటె పురుషుల సంఖ్య తక్కువగా వుంది. ఫ్రెంచి మాష్టారు డిఫోర్జి అందరికంటె ఎక్కువసేపు నాట్యం చేశాడు. అందరు అమ్మాయిలూ అతనినే జట్టుగా ఎంచుకున్నారు. అతనితో చాలా చక్కగా నాట్యం చెయ్యవచ్చని అంతా అనుకున్నారు తతిమా పడుచులు ఎగతాళిగా చూసే చూపులమధ్య, డిఫోర్జి మాషాతో

కలిసి గదిచుట్టూ చాలాసార్లు నాట్యం చేశాడు. ఆఖరికి నడిరాత్రి అవగానే పెట్రోవిచ్ నాట్యం ఆపమని చెప్పేసి, తన పడకగదిలోకి వెళ్ళిపోయాడు.

అతను లేకపోయేసరికల్లా అతిథులందరికీ ఎక్కడలేని స్వేచ్ఛా ఆనందం వచ్చాయి. పురుషులు స్త్రీల ప్రక్కని కూర్చోడానికిగాని పడుచు అమ్మాయిలు నవ్వుతూ పక్క వాళ్ళతో గుసగుస లాడడానికి గాని, వయస్సు మళ్ళినస్త్రీలు ఒకరితో ఒకరు బిగ్గరగా మాటాడుకోడానికి గాని ఎంతో వీలు చిక్కింది. పురుషులు త్రాగుతూ వాదిస్తూ నవ్వుతు న్నారు. ఒక్క-మాటలో చెప్పాలంటే, ఆ రాత్రి వారు చాలా సంతోషకరంగా మరిచిపోలేనంతగా గడిచిపోయింది.

ఈ సంతోషంలో భాగం పుచ్చుకోనివాడల్లా ఒక్క పఫ్నూటిచ్ మాత్రమే. పరధ్యానంగాభోజనంచేసి, మౌనంగా చిరాకుగా ఒక్కడూ కూర్చున్నాడు. స్థిమితం లేనట్టుగా కని పిస్తున్నాడు. దొంగల గురించి చెప్పుకున్న మాటలన్నీ అతని మనస్సును చికాకు పరిచాయి. భయం కలిగించాయి. ఆ మాటలకి అతను భయపడ్డానికి తగిన కారణం త్వరలో మీరు తెలుసుకుంటారు.

దైవ సాక్షిగా అతని రత్నాలపెట్టె ఖాళీ అయిపో యిందని పఫ్నూటిచ్ చెప్పడం అక్షరాలా నిజం! ఆ రత్నాల పెట్టె నిజంగానే ఖాళీ అయిపోయి, అందులోవున్న డబ్బంతా అతని చొక్కా కింద మొలలో ఉంచుకున్న తోలుసంచీలోకి బదిలీ అయిపోయింది. అందువల్లనే-అంటే ఈ జాగ్రత్త తీసు కున్నందువల్లనే, ఎవరిమీాద నమ్మకంలేని అతనికి ఈ భయం

వల్ల స్థిమితం లేకుండాపోయింది. పరాయి యింట్లో ఆ రాత్రి బలవంతాన ఉండిపోవలసివచ్చినందువల్లా; దొంగలు సులభంగా చౌరబడ్డానికి వీలుగావుండేటట్లు-దూరంగా వుండే ఏ గదిలో తాను పడుకోవలసి వస్తుందో అన్న భయంవల్లా, అతను అక్కడ నమ్మకమైన స్నేహితుడి కోసం చూశాడు. ఆఖరికి అతని దృష్టి డిఫోర్జి మీద పడింది. అతని శరీరబలం, ఎలుగుబంటినే ఎదుర్కొన్న అతని సాహసం, పప్నూటిచ్ అతన్ని తన స్నేహితుడిగా ఎంచుకోవడాన్ని బలపరిచాయి. నిజానికి డిఫోర్జి ఎలుగుబంటిని చంపిన వివరం తలంపుకు వచ్చినప్పుడు గుర్పాటు కలిగింది. అతిథులంతా బల్ల దగ్గరనుంచి లేస్తున్న సమయంలో పప్నూటిచ్ మెల్లగా డిఫోర్జి దగ్గరగా చేరాడు. కొంచెం దగ్గి, గొంతు సవరించుకొని ఆఖరికి తెగించి ఇలా అనగలిగాడు.

"చూడండీ-ఈ రాత్రి మట్టుకు నేను మీ గదిలో పడుకోవచ్చా మాస్టారుగారూ!"

డిఫోర్జి అతనివేపు మర్యాదగా చూసి, ఏం కావాలి అని ఫ్రెంచి భాషలో అడిగాడు.

"ఓ-ఇంకా మీరు రష్యాభాష నేర్చుకోలేదంటే వింతగా వుంది" అన్నాడు పప్నూటిచ్. అదృష్టవశాత్తూ పప్నూటిచ్‌కి ఫ్రెంచిభాష రావడం మేలయింది. వచ్చీరాని ఫ్రెంచిలో డిఫోర్జితో తన ఉద్దేశాలు తెలియజేయగా డిఫోర్జి కూడా ఆ మాటల అర్థాలు తెలుసుకున్నట్టు తిరిగి తన భాషలో ఏదో చెప్పాడు. పప్నూటిచ్ తన గదిలో నిద్రపోవడానికి అతను అంగీకరించాడు. అతిథులు లేచి ఒకరితో

ఒకరు వస్తామని సెలవు తీసుకొని ఎవరి గదుల్లోకివాళ్లు వెళ్ళిపోయారు. డిఫోర్జి నివసించే గదిలోకి పప్చూనటిచ్ వెళ్ళారు. అవి చీకటి రాత్రులు. అంచేత డిఫోర్జి కొవ్వొత్తి వెలిగించి దారి చూపిస్తూ నడవగా పప్చూనటిచ్ కృతజ్ఞత తెలియజేసి సంతోషంగా నడుస్తూ, అప్పుడప్పుడు మొల తడుముకుంటూ తోలుసంచి జాగ్రత్తగా సురక్షితంగా మొలలో వుందని తెలుసుకుంటూ బయల్దేరాడు.

గదిలోకి వెళ్ళాక, డిఫోర్జి దుస్తులు మార్చుకోసాగాడు. పప్చూనటిచ్ దుస్తులు మార్చుకునే ముందు, గదంతా ఒకసారి తిరిగి, కిటికీలూ తలుపు గడియలూ సరిగ్గా ఉన్నాయో లేవో అని పరిశీలించి గది అంత సురక్షితంగా లేదన్నట్టు తల ఆడించాడు. తలుపుకి ఒక్కటే గడియవుంది. కిటికీజాలు ఏమంత బలంగాలేదు. ఆ సంగతి డిపోర్జితో చెబుదామనుకున్నాడు గాని అతనికి వచ్చిన ఫ్రెంచిభాష చాలా తక్కువ కావడంవల్ల, ఆ మాటలన్నీ డిపోర్జికి తెలిసేలా చెప్పడం కష్టమని పూరుకున్నాడు. ఏదో చెప్పాడుగాని అది డిపోర్జికి అర్థంకాలేదు. వాళ్ళ యిద్దరి మంచాలు ఎదురెదురుగా వున్నాయి. ఇద్దరూ మంచాలమీద పండుకోగానే డిపోర్జి కొవ్వొత్తి ఆర్పేశాడు.

'నేను చీకట్లో పండుకోలేను మాష్టరుగారూ. దీపం వెలిగించండి,' అని పప్చూనటిచ్ వచ్చీరాని ఫ్రెంచిలో చెప్పాడు. అది డిపోర్జికి బోధపడక హాయిగా నిద్రపొండని చెప్పి కళ్లు మూశాడు.

"వట్టి విదేశీ జంతువు" అని పప్నూటిచ్ తిట్టుకుని దుప్పటి తీసి భుజాలదాకా ముసుగు వేసుకొని కప్పుకున్నాడు. "దీపం ఎందుకార్పేశాడో దుర్మార్గుడు!" అని తిట్టుకొని "మాష్టరూ, ఓ మాష్టరూ! దీపం లేకపోతే నాకు నిద్ర పట్ట దయ్యా-వెలిగించవయ్యా బాబూ నీకు పుణ్యం వుంటుంది" అని ఎంత అరిచినా ఆ ఫ్రెంచి మనిషి వినిపించుకొని జవా బిస్తేనా? అతను గురకలు తీస్తున్నాడు హాయిగా.

"గురక మొదలు పెట్టాడు గుడ్డగాడు! ఫ్రెంచి మృగం" అనుకున్నాడు ఆంటన్ పప్నూటిచ్, 'కన్నుమూత పడందే! ఏ నిమిషాన్నైనా తలుపులు తెరుచుకుని దొంగలు మీద పడొచ్చు; లేదా కిటికీలోంచి వచ్చిపడొచ్చు; ఈ జంతువు తుపాకి దెబ్బకికూడా లేచేటట్టులేదు' అనుకున్నాడు, 'ఏమయ్యో మాష్టారూ; హోయ్ మాష్టారూ...నిన్ను అసి రమ్మ యెత్తుకుపోనూ" ఎంత అరిచినా లాభంలేకపోయింది. కాస్సేపటికి పప్నూటిచ్ మౌనం వహించాడు. అలసటవల్లా త్రాగుడు మైకంవల్లా అతని భయాలన్నీపోయి చిన్న కునుకు పట్టింది. కొంతసేపటికి గాఢంగా నిద్రపట్టేసింది.

ఎవరో వింతగా తనని మేల్కొలుపుతున్నట్టు అనిపించింది నిద్రలో తన చొక్కా కాలరు పట్టుకొని ఎవరో లాగుతున్నట్టయింది. పప్నూటిచ్ కళ్లు తెరిచాడు. ఆ వేకువ వేళలో సన్నని వెల్తురులో తన ముందు డిఫోర్జి నిలబడడం చూశాడు. డిఫోర్జి ఒకచేతిలో చిన్న పిస్తోలు పట్టుకుని, మరొక చేతితో తన మొలనున్న తోలుసంచి లాగుతున్నాడు. పప్నూటిచ్ భయపడి, 'ఏమిటి మాష్టరుగారూ...ఏమిటి

దందా; అని క్రోధించి భాషలో డిపోర్జిని అడిగాడు, వణికి పోతూ.

'ష్! నోరుముయ్యి.' అని డిపోర్జి చక్కని రష్యా భాషలో మాట్లాడుతూ ఇలా అన్నాడు:- నోరు కదిపితే ప్రాణాలు తీస్తాను. నా పేరు డుబ్రోవుస్కీ.'

# 11

ఈ కథలో జరిగిన పరిస్థితుల్నిబట్టి, కొన్ని కొత్త సంఘటనలు చెప్పవలసిన అగత్యం వుంది.

ఒక గ్రామసంది వద్ద ఒక మూలని ఒక బాటసారి కూర్చున్నాడు అతని కళ్ళలో ఏదో విచారం అనుభవిస్తున్నట్టు కనిపిస్తుంది, దానిని బట్టి అతను పరాయి దేశంనించి వచ్చిన వాడని గాని, లేదా ఒక సామాన్య కుటుంబానికి చెందిన వాడని గాని తెలుస్తుంది. గాని హోదా గల కుటుంబంలోనుండి వచ్చినవాడిలా కనిపించడంలేదు. అందువల్ల ఆ గ్రామసంధి యజమాని అతని గురించి ఏమీ పట్టించుకో లేదు. ఆవరణలో అతని చిన్న బగ్గీ నిలబడివుంది. వాటి చక్రాలకి చమురు పట్టించవలసిన అవసరం వుంది. దాంట్లో ఒక చిన్న బట్టలసంచి వుంది. ఆ సంచి గల ఆసామీ ఎంత బీదవాడో దాన్ని బట్టి తెలుస్తుంది. ఆ బాటసారి అక్కడ 'టీ' గాని 'కాఫీ' గాని అడగలేదు. కిటికీలోంచి అవతలికి చూస్తూ ఈల వేస్తున్నాడు. ఆ మజిలీ యింటి యజమాను

రాలు అవతలివేపు కూర్చుని చాలసారి ఈలలకి అసహ్యించు కుంది.

"దేవుడు మనకో ఈలగాణ్ణి పంపించాడు" అన్నది ఆవిడ మొగుడితో.

'ఈలలు వేసుకుని ఆ ఉన్నది కాస్తా ఊడగొట్టుకుం టాడు యీ పాడు పరదేశి.'

భర్త 'పోనీ మనకేం... ఈలలు వేసుకోనీ-మన కెం దుకు మధ్య' అని సమర్థించాడు.

'మన కెందుకా! బాగానే వుంది. అది అపశకునం అని తెలీదూ మీకు!' అని మండిపడింది మగనాలు.

'అపశకునమా?' అనడిగాడు అమాయకుడైన మగడు. 'ఈల ఊదితే డబ్బు కాస్తా ఊడుకు పోతుందనా నీ ఉద్దేశం? ఎంత వెర్రి బాగుల దానివే పకోమోవ్వా? ఈల ఊదినా, ఊదకపోయినా, మన గడింపులో మార్పేమీ వుండదే..." అని అర్థాంగికి బోధ పరిచాడు.

యజమానురాలికి ఇదేమీ గిట్టలేదు. 'పోనిస్తురూ... వాడినిక్కడనించి పంపేద్దురూ. వాడిక్కడుంటే మనకి ఒరిగి పడే దేమిటి? వాడికా గుర్రాలిచ్చి ఎక్కడికి పోతాడో వాడి వల్ల కొట్లోకి పొమ్మందురూ' అంది అందుకు యజమాని ఇష్ట పడలేదు.

"వాడే పడుంటాడు లేవే పకోమావ్వా! మన గుర్రాల సాలలో వున్నవల్లా మూడే బగ్గీలు, నాలుగోది విశ్రాంతి తీసుకుంటోంది. ఏ క్షణానికి ఏ పెద్దమనిషి వస్తాడో మరి! ఈ ఫ్రెంచి వాడి కోసం నా గొంతు కోసుకో మన్నావా

యేమిటి? చూడు! నేననుకున్నట్టే అయింది. ఎవరో గుర్రపు బగ్గీలో వస్తున్నారు. ఎంత గేలప్‌లో వస్తున్నారో చూడు. ఎవరో సేనాధికారి అయివుండాలి.''

ఒక బగ్గీ ఆ యింటి ముందు ఆగింది. బండివాడు బగ్గీ దిగి బండితలుపు తెరిచాడు. బండిలోంచి పటాలం దుస్తులు వేసుకున్న ఒక యువకుడు తెల్లని టోపీతో దిగి, మజిలీయింటి యజమాని దగ్గరికి బండివాడితో బాటు వెళ్ళి, కిటికీదిమ్మమీద తన పెట్టెని పెట్టించాడు.

"గుర్రాలు కావాలి", అన్నాడు అధికారస్వరంతో ఆ ఉద్యోగి.

"చిత్తం నిమిషంలో ఏర్పాటు చేస్తాను", అని మజిలీ యింటి యజమాని జవాబిచ్చి 'తమకింకేమైనా కావాలా?' అని ఆదరణగా అడిగాడు.

"ఇంకేం అక్ఖర్లేదు. నే నెక్కడికి వెళ్తున్నానో-నే నెవర్నో మీకు తెలుసా?'' అని ఆ అధికారి అడిగాడు.

యజమాని కాస్సేపు నివ్వెరపోయినట్టు కనిపించాడు. తక్షణం బండివాళ్ళని తొందరపెట్టడానికి పరుగెత్తాడు. యువకుడు కాస్సేపు గదిలో అటూ ఇటూ పచారు చేశాడు. తర్వాత అవతలి గదిలోకి వెళ్ళి యజమానురాలిని పలకరించి ఆ రెండవ బాటసారి యెవరని మెల్లగా అడిగాడు.

"ఆ భగవంతుడికే తెలియాలి అతనెవరో'' అని ఆ యిల్లాలు ముందు చెప్పి, తర్వాత, "ఎవరో ఫ్రెంచిమునిషి

-ఈలగాడు. వాడినిచూస్తే నాకు మండుకొస్తుంది'' అని చెప్పింది.

యువకుడు ఆ ఫ్రెంచి బాటసారితో ఫ్రెంచిలో మాటాడాడు. 'మీారెక్కడికి వెళ్తున్నారో తెలుసుకోవచ్చా?' అని అడిగాడు.

'పక్క పూరికి' అని ఫ్రెంచి బాటసారి జవాబిస్తూ, "అక్కడ నుండి ఒక భూస్వామి యింటికి వెళ్ళాలి. అతను నన్ను వాళ్ళ యింట్లో మాష్టరుగా నియమించానని ఉత్తరం ద్వారా తెలియపరిచాడు. అక్కడికి ఈ వాళే నేను చేరుకోగలననుకున్నాను గాని ఈమజిలీ యజమాని అలా చేరనిచ్చే టట్టులేడు. ఈ దేశంలో గుర్రాలు దొరకడం చాలా కష్టం సుమండి'' అని చెప్పాడు.

'మీారు వెళ్ళబోతున్న భూస్వామి పేరు?' అధికారి అడిగాడు.

'పెట్రోవిచ్' అన్నాడు బాటసారి.

'పెట్రోవిచ్చా? ఏ పెట్రోవిచ్?"

'కిరిల్లా పెట్రోవిచ్ ట్రయకురోవ్-ఫ్రాకోవుస్కోయ్ జమీాందారు. ఆయన గురించి చాలా చెడుగావిన్నాను. చాలా కఠినుడనీ; గర్విష్ఠిఅనీ పనివాళ్ళని చాలా కర్కశంగా చూస్తాడనీ అంటారు. ఎవరూకూడా ఎక్కువ కాలం అతని దగ్గర పని చెయ్యలేరనీ-మాష్టర్లని అతనేమాత్రం లెక్క చెయ్యడనీ-అప్పుడే ఇద్దర్ని యమలోకానికి పంపాడని కూడా అంటారు''

అయితే అలాంటి రాక్షసుడి దగ్గరికి వెళ్ళడానికి నిశ్చయించు కున్నారన్నమాట?" అన్నాడు అధికారి.

"ఏం చెయ్యనండి మరి? అన్ని సమపాయాలూ ఇచ్చి ఏడాదికి మూడు వేల రూబుళ్ళు జీతం ఇస్తానన్నాడు. అందరి కంటె నేను ఒక విధంగా అదృష్టవంతుడననే చెప్పుకోవాలి. మా అమ్మ మాత్రం వుంది. ఏటా ఆవిడ ఖర్చుకోసం జీతంలో సగం పంపించినా, అయిదేళ్ళలో నేను చాలా సొమ్ము కూడబెట్ట గలుగుతాను. ఆ మీదట చాలా స్వతంత్రంగా బ్రతకవచ్చు. పేరిస్ వెళ్ళిపోయి ఈ సొమ్ము మదుపుపెట్టి హాయిగా జీవించవచ్చు"

"మిమ్మల్ని తెలిసిన వాళ్ళెవరైనా పృకోవుస్కోయిలో వున్నారా? పెట్రోవిచ్ భవనంలో మిమ్మల్ని యెరుగున్న వాళ్ళెవరన్నా వున్నారా?" అని ఆ యువకుడు అడిగాడు.

ఫ్రెంచి మనిషి జవాబుగా, "ఎవరూ లేరండి. పెట్రోవిచ్‌కి మాస్కో పట్టణంలో ఒక స్నేహితుడు వున్నాడు. అతని ద్వారా కబురు పెట్టాడు. ఆ మాస్కో స్నేహితుడి దగ్గర మా వూరి మనిషి ఒకాయన పనిచేస్తున్నాడు. అతను నన్ను సిఫారసు చేశాడు నిజానికి నేను బిస్కత్తులుతయారీలో విద్య నేర్చాను గాని ఉపాధ్యాయుడి పని నేర్వలేదు. కాని మీ దేశంలో ఉపాధ్యాయుడి ఉద్యోగం చాలా లాభసాటి అని తెలిశాక..." అని ఇంకా ఏదో చెప్పబోతున్నాడు గాని అధికారి–యువకుడు ఏవో ఆలోచనలలో మునిగి పోయారు.

యువకుడు ఫ్రెంచి మనిషి మాటలకి అడ్డువచ్చి-అతని వేపు తిరిగి ఇలా అన్నాడు:- "చూడండి... మీరు ఈ ఉద్యోగం విడిచిపెట్టి, తిరిగి మీ పేరిస్‌కి వెళ్ళిపోవడానికి గాను మీకు, ఎవరన్నా పదివేల రూబుల్లు నగదు తక్షణం ఇస్తారనుకోండి...ఏమంటారు మీరు?"

ఫ్రెంచి మనిషి ఆ అధికారివేపు ఆశ్చర్యంగా చూసి, తర్వాత చిరునవ్వు నవ్వి తల ఆడించాడు.

మజిలీ యజమాని అక్కడికి వచ్చి. గుర్రాలు తయారుగా వున్నాయి," అన్నాడు నౌకరు కూడా ఆ మాటలే అన్నాడు.

అధికారి వాళ్ళవేపు చూసి, 'ఒక్క నిమిషం ఆగండి. కొన్ని నిమిషాలు మీరు ఈ గదివిడిచిపెట్టి అవతలవుంటారా దయచేసి', అని అనగానే మజిలీ యజమాని నౌకరు అవతలికి వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళాక అధికారి మళ్లీ ఫ్రెంచి మనిషితో మాటాడాడు.

'నేను హాస్యమాడ్డంలేదు-నేను మీకు నిజంగా పదివేల రూబుళ్ళు ఇస్తాను. నాకు కావల్సిందల్లా మీరిక్కడనించి తక్షణం మీ దేశానికి వెళ్లిపోవడం, మీ దగ్గరున్న కాగితాలన్నీ నాకిచ్చెయ్యడం...ఇంతే' అంటూ అధికారి పెట్టి తెరచి, అందులోంచి కొన్ని నోట్ల కట్టలుతీశాడు. ఫ్రెంచి మనిషి కళ్లు పెద్దవిచేసి ఆ నోట్లవేపు చూశాడు. అతనికి ఏంచెయ్యడానికీ పాలుపోలేదు.

'నేను మా దేశం పోవడం. నా కాగితాలు మీ కివ్వడం,' అని అతను ఆశ్చర్యపోతూ, అనుమానపడుతూ 'ఇవిగో

నా కాగితాలు...కాని మీరు హాస్యమాడుతున్నారనుకుం టాను. కాకపోతే నా కాగితాలు మీ కెందుకు చెప్పండి' అని సంశయం వెలిబుచ్చాడు.

'అదంతా మీకు అనవసరం-ఇష్టమా ఇష్టంలేదా చెప్పండి' అన్నాడు అధికారి.

తన చెవుల్ని తనే నమ్మలేక ఫ్రెంచి మనిషి సంశ యిస్తూనే తన కాగితాలు తీసి అధికారి చేతుల్లో పెట్టాడు. అధికారి గబగబా కాగితాలన్నీ తిరగేశాడు.

" 'టిక్కెట్టు' బాగుంది! 'సిఫారస్ వుత్తరం' ఇదే మిటో చదవాలి—ఓహో! "మీరు పుట్టిన తేదీని గుర్తించిన కాగితం" బలే! అంతా బాగానే వుంది. ఇదిగో మీ డబ్బు- తీసుకుని మీ దేశానికి పొండి. నమస్తే!" అన్నాడు అధికారి.

ఫ్రెంచి మనిషి నివ్వెరపోయి చూస్తున్నాడు అధికారి. మళ్ళీ అతని దగ్గరికి వచ్చి 'అసలు విషయం మరిచిపోయాను. ఈ రహస్యం మనిద్దరి మధ్యనే వుండాలి. మూడో మనిషికి తెలియకూడదు. అలాగని ప్రమాణం చెయ్యండి' అని అడిగాడు. ఫ్రెంచి మనిషి ప్రమాణం చేశాడు.

"కాని నా కాగితాలు? అవి లేకుండా నేనేంచేసేది?" అన్నాడు.

అధికారి ధైర్యం చెప్పాడు. 'మీ కేం ఫర్వాలేదు. దుబ్రోవుస్కీ మీ కాగితాలు దొంగిలించాడని చెప్పండి. నకలు కాగితాలు ఇస్తారు. నమస్తే! వీలయినంత వేగంగా మీ దేశం చేరుకోండి. మీ అమ్మగారు క్షేమంగా వుండి మీరు రాగానే ఆనందిస్తారు' అని చెప్పి దుబ్రోవుస్కీ వెం

టనే అవతలికి వెళ్ళిపోయి, గుర్రపు బగ్గీలో కూర్చోగానే గుర్రాలు పరుగు పుచ్చుకున్నాయి.

మజిలీ యజమాని, ఆ గుర్రపు బగ్గీ వెళ్ళిపోవటం కిటికీలోంచి చూశాక భార్య వంక తిరిగి, 'పక్రోమోవ్నా! అతనెవరో తెలుసా నీకు? అతనే డుబ్రోవుస్కీ' అని విస్ఫారంగా చెప్పాడు. భార్య తటాలున కిటికీ దగ్గరికి దూకి అవతలికి చూసింది. కాని అప్పటికి ఆలస్యమైపోయింది. డుబ్రోవుస్కీ అప్పటికి చాలా దూరమైపోయాడు. దాంతో ఆవిడ భర్త మీద ఒక్క ఎగురు ఎగిరింది.

"ఏమండీ, మీకు భయం కొంచెమన్నా లేకుండా పోయిందే? ఈ విషయం ముందుగానే నాతో ఎందుకు చెప్పలేదు మీరు? చెబితే డుబ్రోవుస్కీని తొంగిచూడనన్నా చూద్దునే! అతను మళ్లీ ఇక్కడికి వస్తాడన్న నమ్మకమేమిటి? మీకు బొత్తిగా సిగ్గులేదు. నిజంగా మీరు వట్టి సిగ్గులేని మనుషులు సుమండీ!' అని కోప్పడింది.

ఫ్రెంచి మనిషి కొయ్యబారి ఇంకా అలాగే నించున్నాడక్కడ! అధికారికీ తనకీ జరిగిన ఒప్పందం, డబ్బు, అంతా కలగా కనిపించింది. కాని జేబులో నోట్ల కట్టలు వుండడం-ఈ అద్భుత సంఘటన యథార్థంగానే జరిగిందనడానికి నిదర్శనమైంది. ఎలాగైతేనేమి, ఆఖరికి గుర్రాలు తీసుకుని పక్కవూరికి చేరుకుందామని బయల్దేరాడు. బండివాడు మెల్లగా బండితోలాడు. పక్కవూరు చేరుకునే సరికి చీకటి పడింది.

ఆ ప్రాకారగేటు దగ్గర కావలివాళ్ళుండటం చూశాడు. ఇంకా గేటు రాకముందే ఫ్రెంచి మనిషి బండి దిగి, కాలి నడక సాగిస్తూ, బగ్గీని అందులోని పెట్టెనీ ఇనాముగా తీసుకొమ్మని సంజ్ఞలుచేసి వెళ్ళిపోయాడు. దుబ్రోవ్స్కీ పదివేలిస్తానంటే ఫ్రెంచి మనిషి ఎలా నిష్క్రాంతపోయాడో, ఫ్రెంచి మనిషి బగ్గీని, పెట్టెని తనకి విడిచి పెడతానంటే బండివాడు కూడా అలాగే నిష్క్రాంతపోయాడు. ఆ బాటసారికి మతిపోయిందనినిశ్చయించుకున్నబండివాడు అతనికికృతజ్ఞత తెలియజేసి నమస్కారం చేసి, ఊళ్ళోకి వెళ్ళడానికి ఇష్టపడక, తనకి తెలిసిన ఒక కులాసాల కొంపకి బండిపోనిచ్చాడు. ఆ కొంప యజమాని తనకి దగ్గర స్నేహితుడు. అతనా రాత్రంతా అక్కడే గడిపి, మర్నాడుదయం ఇంటికి బయల్దేరాడు. బగ్గీగానీ పెట్టెగాని లేవు. అతని ముఖం పాలిపోయింది. కనుబొమ్మలు ఎర్రబారిపోయాయి.

ఫ్రెంచి మనిషి కాగితాలు స్వాధీనం చేసుకున్న మన దుబ్రోవుస్కీ, ఇందాక మనం చూసినట్టు, ధైర్యంగా పెట్రోవిచ్ ముందు కనబడి, తర్వాత తనకి ఏర్పాటు చేసిన గదిలో బస చేశాడు. అతని రహస్య తలంపులేమోగాని అతని ప్రవర్తనలో మటుకు ఎలాంటి పొరపాట్లూ కన్పించలేదు. చిన్నమ్మాయి సాషాకి చదువు చెప్పడంలో అతనేం బాధపడలేదన్నదిమటుకు నిజమే. చీట్లాడడంలో సంపూర్ణ స్వాతంత్ర్యం సంపాదించుకొన్నాడు. అతను సాషాకి చెప్పే పాఠాలు సరైనవో కావో కూడా అతనికి పట్టించుకునేవాడుకాడు. ఊరికే చదువు చెబుతున్నట్టు నటించడానికి, కనిపించడానికి

అలా చేసేవాడు. రెండవ శిష్యురాలైన మాషాతో పియానో దగ్గర గంటలతరబడి కూర్చుని, సంగీతం నేర్చుకోవడంలో మాషా చేస్తున్న సాధనని గమనించేవాడు. ప్రతి వక్కరూ మాష్టర్ని ఇష్టంగా చూసేవారు. వేటలో అతను కనబరిచే నిర్లక్ష్యమైన ధైర్యానికి పెట్రోవిచ్ మెచ్చుకొనేవాడు. ఇతని అంతులేని ఉత్సాహానికీ, సిగ్గుతో ప్రేమతో ఆడే మాటలకీ మాషా సరదాపడేది. చీట్లాటలో ఇతను చూపే తెలివితేటలికి 'సాషా' మురిసిపోయేది. ఇతని మంచి నడవడికీ, ఔదార్యానికీ నౌకర్లు గౌరవించేవారు. ఆ కుటుంబంలో దుబ్రోవ్స్కీ కూడా ఒకడైనట్టుగా తనయింట్లో ఉన్నట్టుగానేవుండేది అతనికి ఆ యింట్లో.

దుబ్రోవ్స్కీ ఉపాధ్యాయ వృత్తిలో చేరింది లగాయితు ఈ విందు జరిగిన రోజుకి ఒక నెల గడిచింది; కాని ఈ జిత్తులమారి ఫ్రెంచి యువకుడే భూస్వాముల హృదయాలను హడలగొట్టే భయంకర చోరసింహమని, ఒక్కరైనా అనుమానించలేదు. దుబ్రోవ్స్కీ ఒక్కనాడైనా 'పొక్రోవ్స్కోయ్' గ్రామాన్ని విడిచిపెట్టి ఎక్కడికి వెళ్ళలేదు. కాని పల్లె ప్రజల భ్రమలవల్ల, దుబ్రోవ్స్కీ దొంగతనాలింకా అలా జరుగుతున్నాయనే వదంతులు పుడుతూనేవున్నాయి. అయితే నాయకుడు లేకపోయినా దొంగలముఠా దొంగతనాలు సాగించినా సాగించవచ్చు.

ఆ విందునాటి రాత్రి దుబ్రోవ్స్కీ మరో వ్యక్తితో తన గదిలో నిద్రపోవడం ఇదివరకే జరిగింది. ఆ వ్యక్తి తన శత్రువనీ, తన దురదృష్టాలికి అతను కూడా ముఖ్యకారకుడని

తెలుసుకున్నాక దుబ్రోవ్స్కీ ఉద్రేకం ఆపుకోలేకపోయాడు. ఆతని కెలాగోగాని ఆ వ్యక్తి దగ్గర తోలు సంచీ ఉన్న విషయం తెలిసి, అది సంపాదించాలని నిశ్చయించాడు. అకస్మాత్తుగా ఉపాధ్యాయుడిగా వుంటున్నవాడల్లా గజదొంగగా మారిపోవడంతోనే అంటన్ పఫ్నూటిచ్ నిర్ఘాంతపోయి చూడ్డం మనకి తెలిసిన విషయమే.

మర్నాడుదయం తొమ్మిది గంటలకల్లా రాత్రంతా విందులో పాల్గొన్న అతిథులంతా ఒకరి తర్వాత ఒకరు దర్బారు గదిలోకి చేరి కూర్చున్నారు. పెత్రోవిచ్ ఖరీదైన ఉన్ని బట్టలు ధరించి విలువైన చెప్పులు వేసుకుని ఠీవిగా సోఫాలో కూర్చుని కూజాలాంటి పెద్ద కప్పుతో తాగుతున్నాడు. ఆ ప్రక్కని పొద్దుటపూట వేసుకునే దుస్తులు ధరించి మాషా కూర్చుని ఆవిరులువస్తున్న కప్పులోని టీ తాగుతోంది. అతిథులందరిలోనూ ఆఖరున కూర్చున్నవాడు అంటన్ పఫ్నూటిచ్. అతని ముఖం పాలిపోయి కత్తివాటుకి నెత్తురుచుక్క లేకుండా పోయింది. రాత్రి సుఖంగా నిద్ర పట్టిందా అన్న పెత్రోవిచ్ ప్రశ్నకి కలవరపడ్డాడు. అసలు ఏమీ జరగనట్టే ఖచ్చితంగా అక్కడనే కూర్చున్న ఫ్రెంచి మాష్టారువేపు భయంతో చూస్తూ, పెత్రోవిచ్ ప్రశ్నకి జవాబుగా పఫ్నూటిచ్ ఏదో అర్థంలేని మాటలన్నాడు. కొన్ని ఘడియల తర్వాత ఒక నౌకరు వచ్చి అతని బగ్గీ సిద్ధంగా వుందని చెప్పడమే తడవుగా, పఫ్నూటిచ్ అమాంతంగా లేచి, పెత్రోవిచ్ ఉండమని ఎంతచెప్పినా వినకుండా, తొందరగా సెలవు తీసుకొని గబగబా బయటకి వచ్చి,

తుర్రున బగ్గీలో పారిపోయాడు. అందరూ అతనికేంవచ్చిందా అని విడ్డూరపడ్డారు. పెట్రోవిచ్ మాత్రం అతనికి తిండి మోతాదు ఎక్కువై వుంటుందని నిర్ధారణ చేసుకున్నాడు. ఉదయపు ఫలహారం, టీ ముగించాక మిగిలిన అతిథులంతా ఎవరిమట్టుకు వాళ్లు సెలవు తీసుకుని వెళ్లిపోయారు. పొక్రోవ్‌స్కోయి గ్రామం అతిథులు వెళ్ళిపోవడంతో ఖాళీ అయింది. తర్వాత అంతా మామూలుగా గడిచిపోయింది.

# 12

ఆ తర్వాత చాలా రోజులు చెప్పుకోదగిన విశేషా లేమీ లేకుండానే గడిచిపోయాయి. పొక్రోవ్‌స్కోయ్ గ్రామ ప్రజల జీవితం నిస్తేజమైనది, పెట్రోవిచ్ రోజూ వేటాడే వాడు. చదవడం, షికారు, సంగీతపాఠాలు, ఇవే మాషా పనులు. ఇందులో ముఖ్యమైనవి సంగీత పాఠాలు! తన హృదయాన్ని తనే ఆమె అర్థంచేసుకోవడం ప్రారంభించింది. ఫ్రెంచి యువకుడి గుణ విశేషాలపట్ల తను ఏ విధంగానూ, విముఖత్వం చూపడం లేదన్న సంగతి బాధగానే తను ఒప్పుకుంది. ఫ్రెంచి యువకుడు మాత్రం మర్యాదని అతిక్రమించక అతిగౌరవంగా ప్రవర్తించడంవల్ల మాషా దర్పానికి కొంత బాధగా ఉండేది. అతను కట్టుదిట్టంగా వుండడంవల్ల మాషాకి వున్న పిరికి అనుమానాలు నివృత్తికాలేదు. నానాటికీ ఎక్కువవుతున్న ‘ఆనందభావోద్రేకాలకు ఆమె’ లొంగి పోయింది. డిఫోర్జి కనబడకపోతే ఆమెకు తోచేదికాదు,

అతను దగ్గరగా వున్నప్పుడు అతన్ని తప్ప ఇంకెవరినీ పట్టించుకునేది కాదు. అన్ని సంగతుల గురించీ అతని ఉద్దేశాలు తెలుసుకోగోరేది అతని ఉద్దేశాలతో ఏకీభవించేది మాషా ఇంతవరకూ అతనిని ప్రేమించివుండకపోవచ్చు కాని అతను కనిపించినంతనే ఆమె హృదయంలో ఏదో ఉద్రేకం కలిగేది.

ఒకనాడు డిఫోర్జి వుండే పాటాల గదిలోకి మాషా ప్రవేశించే సరికి డిఫోర్జి ముఖం పాలిపోయి వుండడం, కలవరపాటును తెలియజేసే సూచనలు కనిపించడం, గుర్తించి ఆశ్చర్య పడింది. పియానో తీసి ఏవో కొన్ని పాటలు వాయించింది. కాని డిఫోర్జి తనకి తలనొప్పిగా వుందని చెప్తూ పియానా ఆపి, పాటల పుస్తకం మూసేసి, రహస్యంగా మాషా చేతికి ఒక చీటీ అందించాడు. తను ఏంచేస్తున్నదీ తెలుసుకొనడానికి ముందే ఆమె ఆ చీటీని అందుకుంది. అందుకున్న వెంటనే అలాచేసినందుకు పశ్చాత్తాప పడింది. కాని డుబ్రోవుస్కీ ఎప్పుడు వెళ్ళిపోయాడోగాని గదిలో లేడు. మాషా తన గదిలోకి వెళ్ళిపోయి, చీటీ విప్పి, ఇలా చదువుకుంది.

"ఈ రోజు సాయంత్రం ఏడింటికల్లా నది వద్దున ఉండు. నేను నీతో మాట్లాడాలి"

మాషా ఆతురత ఎక్కువయింది; అతని ఉద్దేశాలు తెలుసుకోవాలని ఎన్నాళ్ళనుంచో ఎదురుచూస్తోంది; ఇద్దరూ ఎదురు చూస్తున్నారు కాని ఇద్దరూ భయపడ్డారు. తన ఊహాలు బలపరుచుకోవాలని మాషా అభిలాషపడేది; మాషాని

వివాహం చేసుకుంటాననడానికి తగిన తాహతులేని ఒక సామాన్యుడి మాటలు తను వినడం మంచిదికాదనుకున్నది. కాని నది ఒడ్డున అతనిని కలుసుకోవడానికి నిశ్చయించుకుంది. అయితే ఒక్క విషయం మాత్రం ఆవిడ నిర్ధారణకి రాలేక పోయింది. మేష్టారు చెప్పే మాటల్ని తను ఎలా వినడం? హోదాకు తగ్గ ఠీవితో వినడమా, స్నేహ భావంతో విని ఎగతాళిచేసి ఆ మాటల్ని నవ్వులాటలుగా విడిచిపెట్టడమా, ప్రేమ భావంతో విని మౌనం వహించడమా అని సంశయం పట్టుకుంది. కాని గడియారం వేపు క్షణక్షణానికీ చూడకుండా వుండలేక పోయింది. ఇంతలో చీకటి పడింది. దీపాలు వెలిగించారు. తన దర్శనం కోసం వచ్చిన ఇరుగుపొరుగువారితో పెట్రోవిచ్ పేకాట మొదలు పెట్టాడు. భోజనాల గదిలో వున్న గడియారం పావు తక్కువ ఏడు గంటలయినట్టు ఆమెను హెచ్చరించింది. మాషా మెల్లగా వసారాలోకి అడుగులు వేసుకుంటూ వచ్చి, చుట్టూచూసి, నెమ్మదిగా తోటలోకి దారి తీసింది.

అవి చీకటి రాత్రులు. ఆకాశం మేఘాలతో ఆవరించి ముందు ఏమున్నదో కనబడ్డంలేదు. కాని ఆ తోటదారులన్నీ మాషాకి బాగా తెలిసి వున్నవే గబగబ ఆ చీకటిలోనే నడుస్తూ కాస్సేపటికి నది వొడ్డున వున్న తోటకి చేరింది. అక్కడికి చేరేసరికి భయంకాస్త తగ్గిందేమో, గాఢంగా ఊపిరి తీసింది. డిపోర్జి యెదుట ఠీవిగా, ధైర్యంగా నిర్లక్ష్యంగా నిలబడడానికి గాను కాస్సేపు తమాయించుకుంది.

కాని డిపోర్జి అంతకు ముందే మాషా యెదుట ప్రత్యక్షమై నిలబడి వున్నాడు.

'నా ప్రార్థన తిరస్కరించకుండా వచ్చినందుకు చాలా కృతజ్ఞుడిని! నువ్వు తిరస్కరించి వున్నట్టయితే నేను నిరాశ చెంది వుందును' అన్నాడు గాద్గదీనంగా డిపోర్జి. మాషా తెచ్చిపెట్టుకున్న నిర్లక్ష్యంతో జవాబు చెప్పింది, 'నేను తిరస్కరించలేదుగదా అని మీరు మర్యాద తప్పి తర్వాత పశ్చాత్తాప పడేట్టు చెయ్యరని నా నమ్మకం'

ఆ మాటకి డిపోర్జి ఏమీ అనలేదు గాని ఏదో చెప్ప డానికి ధైర్యం తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నట్టు కనిపిం చాడు. ఆఖరికి తెగించి ఇలా చెప్పాడు.

'పరిస్థితులవల్ల-నేను-నిన్ను-విడిచిపెట్టి వెళ్ళిపోవలిసి వచ్చింది. బహుశా అతిత్వరలోనే ఆ విషయం తెలుసుకో గలవు. కాని విడిపోయేముందు నేను నీతో స్వయంగా ఒక విషయం చెప్పవలసి వుంది'

మాషా ఏమీ అడగలేదు. అతని ఉద్దేశాలు చెప్ప డానికి ముందు ఇలా తొలిపలుకులు ప్రారంభిస్తున్నాడని తలంచింది.

డిపోర్జి తలదించుకొని ఇంకా ఇలా చెప్పాడు; "నేను నువ్వనుకున్న ఫ్రెంచి మనిషి డిపోర్జిని కాను. నా పేరు డుబ్రోవుస్కీ."

ఆ మాటకి మాషా భయపడి కెవ్వున అరచింది.

"భయపడకు మాషా! నా పేరు విన్నంతమాత్రాన నువ్వు భయపడవలసిన అవసరంలేదు. అవును. నీ తండ్రి

ఎవరినైతే తిండి తిప్పలులేకుండా, పిత్రార్జితం దక్కనీకుండా చేసి-బంధిపోటు దొంగగా తయారు చేశాడో ఆ మంద భాగ్యుడైన దుర్భాగ్యుడ్ని నేనే. కాని నువ్వు నా గురించి గాని నీ గురించి గాని భయపడ నక్కరలేదు. అంతా గతించిపోయింది. నేను నీ తండ్రిని క్షమించాను. నువ్వే అతనిని కాపాడావు. మొదట్లో అతన్ని దౌర్జన్యానికి బలి చేద్దామని ఉద్దేశపడ్డాను. అతని గది చుట్టూ తిరుగుతూ ఎక్కడనుండి పిస్తోలు పేల్చడమా అని ఆలోచిస్తూ, ఏమూల నుండి అతని పడక గదిలోకి ప్రవేశించడమా, అతడు తప్పించుకోకుండా ఎలా పన్నాగం పన్నడమా అని ఉపాయాలు ఆలోచిస్తూ ఉండేవాణ్ని. గాని ఇంతలో నువ్వు ప్రక్కనించి దేవతా కన్యలా ప్రత్యక్షమయేసరికి నా హృదయం చల్లబడేది. ప్రయత్నాలు ఆగిపోయేవి. అప్పుడు నాలో నేను అనుకునేవాడిని-నీవు నివసించే భవనం అతి పవిత్రమైనదనీ నీ రక్తసంబంధానికి చెందిన ఏ ఒక్కడైనా సరే నా దౌర్జన్యానికి బలికాలేరనీ అనుకున్నాను. అంతటితో పగ తీర్చుకునే తలంపు వట్టి పిచ్చితనంగా భావించి ఆ వుద్దేశం విడిచి పెట్టేశాను. దూరాన్నించి నీ తెల్లని దుస్తులు కనిపించకపోతాయా అని ఎన్నో రోజులు ఈ తోటల వెంబడి తిరిగాను. నువ్వు తీరిక వేళలలో షికారుగా నడచినపుడల్లా, పొదలమాటున దొంగతనంగా నడుస్తూ, నిన్ను పొంచి చూస్తూ నేను నీకు తోడుగా వున్నాను కదా అనే సంతృప్తితో, కనిపించకుండా నేను నీ దగ్గరలో వున్నంతకాలం నీ కెటువంటి అపాయమూ రాదనేభావంతో

మురిసిపోయే వాడిని. ఆఖరికి నాకు గొప్ప అవకాశం చిక్కింది. మీ యింట్లోనే నాకు బస దొరికింది. ఈ మూడువారాలూ నాకు ఎంతో ఆనందమయింది. ఈ సంతోషదినాలు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నా జీవితంలోని విచారమంతా మరచి పోతాను. కాని నాకు ఒక వార్త వచ్చింది. ఇక్కడ వుండడం ఇక వీలుపడదు. ఈ రోజే నిన్ను విడిచిపెట్టిపోవాలి, ఈ క్షణమే...కాని విడిచిపోయేముందు నీతో ఈ విషయాలన్నీ చెబితే నువ్వు నన్ను నిందించవని, ఏవగించుకోవని; చెప్పాలనుకున్నాను. డుబ్రోవుస్కీని మాత్రం అప్పుడప్పుడు జ్ఞాపకం చేసుకుంటూ వుండు. అతడు పరిస్థితుల వల్ల ఇలా మందభాగ్యుడయ్యాడనీ, అతని హృదయంకి నిన్ను ప్రేమించగల సామర్థ్యం వుందనీ మాత్రం తెలుసుకో''-

అని అంటూండగా చిన్న ఈల వినిపించింది. డుబ్రోవుస్కీ మాటాడ్డం ఆపాడు. మాషా చెయ్యి పట్టుకొని ముద్దు పెట్టుకున్నాడు. మళ్లీ ఈల వినిపించింది.

'క్షమించు మాషా! ఆ ఈల నా కోసమే - నేను వెళ్ళాలి. ఒక్క నిముషంగాని ఆలస్యం చేశానా ప్రమాదం'- అన్నాడు డుబ్రోవుస్కీ.

మాషాని విడిచి నాలుగడుగులు ముందుకు వేశాడు. మాషా నిశ్చేష్టురాలై ప్రతిమలా నిలబడిపోయింది. తటాలున డుబ్రోవుస్కీ మళ్ళీ వచ్చి మాషా చెయ్యి పట్టుకున్నాడు. మృదువుగా, ఉద్రేకంగా ఇలా అన్నాడు-

'ఎప్పుడైనా నువ్వు ఆపదలో చిక్కుకున్నప్పుడు; నీకు తోడుపడే వాళ్లుగాని రక్షకులుగాని లేరని తోచినప్పుడు-

నీ కేసహాయం నా వల్ల కావలసినా, తప్పకుండా నన్ను పిలుస్తానని ప్రమాణం చేస్తావా? నా ప్రేమ తిరస్కరించనని వాగ్దానం చేస్తావా?'

మాషా వెక్కి వెక్కి ఏడుస్తోంది. ఇంతలో మరోసారి ఈల వినిపించింది.

'మాషా! నన్ను ప్రమాదానికి గురిచేస్తావా? నువ్వు ఏదో ఒక సమాధానం చెప్పేదాకా ఇక్కణ్ణుంచి కదలనంటే కదలను. ఒట్టు వేస్తావా లేదా?'

"ఒట్టు", అన్నది. అభాగ్యురాలైన అందాల బరిణె. మెల్లగా.

డుబ్రోవుస్కీని కలుసుకున్నాక, ఎంతో బాధపడుతూ మాషా ఇంటివేపు నడిచింది. ఇంటికి తిరిగి వచ్చాక-ఇంట్లో వున్న వారందరూ పారిపోతున్నట్టుగానూ, ఇల్లంతా కలియ దిరుగుతున్నట్టుగానూ, ఇంటి ఆవరణలో జనం గుమిగూడి వున్నట్టుగానూ కనిపించింది. ఇంటి వసారాలో ఏదో బండి నిలబడివుంది. దూరానికి పెట్రోవిచ్ మాటలు వినిపిస్తున్నాయి. తను ఇల్లు విడిచి వెళ్ళినట్లు కనుక్కున్నారేమో అన్న భయంతో ఇంటిలోకి పరుగు తీసింది. హాలులో పెట్రోవిచ్ ఆమెని చూశాడు హాలులో మన పత్తేదారు చుట్టూ అతిథులు మూగి వున్నారు. అతని మీద ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారు. తలనించి కాళ్ళదాకా కవచాయుధాలు ధరించిన పత్తేదారు ఏదో బ్రహ్మాండమైన రహస్యాన్ని ఛేదించిన వాడిలా డాబుగా జవాబులిస్తున్నాడు.

'ఎక్కడికి వెళ్ళావు మాషా! ఫ్రెంచి మేస్టారు డిఫోర్జె నీకు ఎదురుపడలేదా?' అని పెట్రోవిచ్ అడిగాడు కూతుర్ని. లేదని చెప్పడానికి మాషాకి ఎంతో కష్టమయింది. ఆఖరికి లేదని తెగించి చెప్పింది.

'మరేంలేదు. మన పత్తేదారు అతన్ని పట్టుకోవడానికి వచ్చాడు; అతనే దుబ్రోవుస్కీ!' అన్నాడు పెట్రోవిచ్.

'అన్ని పోలికలూ వున్నాయండి' అని పత్తేదారు గౌరవంగా విన్నవించారు.

'ఓయి నీ పోలికలు తగలెట్ట! ఈ విషయం నేను స్వయంగా చూస్తేగాని ఆ ఫ్రెంచి మేష్టార్ని మాత్రం నీకు అప్పగించను. ఆ పుండాకోర్ షబ్రాష్కిన్ మాటల్ని ఎవరన్నా ఎలా నమ్ముతారు? ఈ మాష్టారు అతన్ని దోచుకున్నట్టు గాని కలగన్నాడో యేమో, లేకపోతే మర్నాటి ఉదయమే ఆ విషయం నాతో ఎందుకు చెప్పలేదు మరి?' అని పెట్రోవిచ్ ఖచ్చితంగా అడిగాడు

"చిత్తం. ఆ ఫ్రెంచి మనిషి అతన్ని బాగా భయపెట్టి, రహస్యం బయటపెట్టకుండా ప్రమాణం చేయించాడండీ," అని పత్తేదారు జవాబిచ్చాడు.

"వట్టి అబద్ధాలపోగు! ఈ విషయమంతా ఒక్కసారి ఇప్పుడే తేల్చేస్తాను. ఎక్కడున్నాడా ఫ్రెంచిమాష్టారు?" అని పెట్రోవిచ్ తన నౌకర్ల వేపు చూశాడు.

"ఆయన ఎక్కడా కనిపించడంలేదండి," అన్నారు నౌకర్లు

"వెళ్ళి చూడండి", అని పెట్రోవిచ్ నౌకర్లకు ఆజ్ఞాపించి, పత్తేదారు వంక తిరిగి, "ఏదీ ఆ అమూల్య మైన ఆనవాళ్ళ కాగితం ఇలా చూపించండి" అని అడగ్గా పత్తేదారు ఆనవాళ్ళ కాగితం అందించాడు.

"హుం! వయస్సు ఇరవైమూడు సంవత్సరాలు. సామాన్యమైన ఎత్తు! క్షవరం చేసుకున్న గడ్డం-గోధుమ రంగు కళ్లు-అంతా బాగానే వుంది కాని ఇవేమీ-నిర్ధారణ చెయ్యలేవు ఇంతకీ ఆ ఫ్రెంచి మేష్టారేరీ?" అని పెట్రోవిచ్ ప్రశ్నించాడు. ఎక్కడా కనిపించడం లేదని మళ్ళీ జవాబు వచ్చింది. దాంతో పెట్రోవిచ్ అనుమానించడం మొదలు పెట్టాడు. పాపం మాషా కూడా జీవంలేని ప్రతిమలా వుంది.

"ఏం అలా వున్నావ్? మాషా! వాళ్లు నిన్ను అదర గొట్టారు" అన్నాడు తండ్రి.

"లేదు నాన్నా! తల నొప్పిగా వుంది" అని జవాబి చ్చింది మాషా.

"అయితే నీ గదిలోకి పోయి నిద్రపో...మరే ఆలో చనలూ పెట్టుకోకు." అని తండ్రి ప్రేమగా చెప్పగానే మాషా తండ్రి దగ్గర సెలవు తీసుకొని, గబగబ తన గదిలోకి వెళ్ళిపోయి, మంచంమీద బోర్లపడి వెక్కి వెక్కి ఏడ్వడం మొదలెట్టింది. అది చూసి దాసీలు పరుగున వచ్చి కొంచెం కష్టంతో ఆమె దుస్తుల్ని మార్పించి, పన్నీటితోనూ సుగం ధాలతోనూ మాషాని సేదదీర్చారు. తర్వాత పరుపుమీద పండుకోబెట్టి నిద్రపుచ్చారు.

ఫ్రెంచి మనిషి మాత్రం కవిపించనేలేదు. పెట్రోవిచ్ చిందులు త్రొక్కుతూ గదిలో ఇటూ అటూ పచారుచేస్తున్నాడు. అతిథులు తమలోతాము ఏవో గుసగుసలాడుకుంటున్నారు. పత్తేదారు ఫ్రెంచి మనిషి కనబడలేదని చిన్నబోయాడు. డిపోర్జికి ముందుగానే ఈ విషయం తెలిసి తప్పించుకున్నాడనేది నిస్సందేహంగా నిజమేగాని ఎలా తెలిసిందో ఎవరు చెప్పారో అన్నదే వింతగా వుంది.

గడియారం పదకొండు గంటలు కొట్టింది. అయినా ఎవరూ నిద్రపోవడం గురించి యోచించడమేలేదు. ఆఖరికి పెట్రోవిచ్ కోపంగా పత్తేదారుతో ఇలా అన్నాడు. 'ఏమయ్యా పత్తేదారూ ఈ రాత్రంతా నువ్విక్కడ తిష్టవెయ్యడానికి వీల్లేదు. ఇది సత్రం కాదు. ఆ ఫ్రెంచివాడే డుబ్రోవుస్కీ అయితే అతన్ని పట్టుకోవడానికి నీకు తెలివితేటలు లేకపోయాయి. ఇంటికి వెళ్ళిపో-మరోమారు ఇంకొంచెం తెలివితేటలు సంపాదించి ప్రయత్నించు" అని అతిథులవేపు తిరిగి, 'మీరంతా ఇళ్ళకుపోయే వేళయింది:మీ బగ్గీలు సిద్ధంచేసుకోండి. నేను నిద్రపోవాలి'అన్నాడు.ఇలా అతిథుల్ని అతి నిర్దయగా పంపించేశాడు యజమాని.

# 13

ఏ విశేషాలూ వింతలూ లేకుండా మరికొన్నాళ్ళు గడిచాయి. కాని మరుచటి వేసవిలో పెట్రోవిచ్ కుటుంబ జీవితంలో చాలా పెద్ద మార్పులు కలిగాయి.

పొక్రోవుస్కోయి గ్రామానికి ముప్ఫయి మైళ్ళ దూరంలో 'వియరిస్కీ' యువరాజు ఎస్టేటుకి చెందిన 'ఆర్బటోవో' అనే గ్రామం వుంది. వియరిస్కీ యువరాజు చాలా కాలం దూరదేశాల్లో వుండడంవల్ల తన ఆస్తినంతా ఒక పించను పుచ్చుకున్న పటాలం ఉద్యోగి చేతుల్లో వుంచాడు. పొక్రోవుస్కోయికిన్నీ, ఆర్బటోవ్‌కిన్నీ అంతవరకూ ఏ సంబంధమూ లేదు. మే నెల ఆఖరున ఎలాగైతేనేమి వియరిస్కీ యువరాజు విదేశాలనుంచి తిరిగి వచ్చి, తను జీవిత కాలంలో ఎన్నడూ చూడని తన ఆర్బటోవో గ్రామం చేరాడు వియరిస్కీ జల్సాలతో సుకుమారమైన జీవితాన్ని గడిపాడేమో, ఒంటరిగా వుండడం భరించలేకపోయాడు. అక్కడికి వచ్చిన మూడవ రోజునే పెట్రోవిచ్‌తో విందారగించడానికి అతిథిగా బయల్దేరాడు. పెట్రోవిచ్‌తో ఎన్నాళ్ళ నుంచో అతనికి పరిచయం వుంది.

ఈ యువరాజుకి షుమారు యాభై సంవత్సరాలుంటాయి కాని అంతకంటె ఎక్కువ వయస్సున్న వాడిలా అవుపిస్తాడు. అన్ని విషయాలలోనూ హద్దులుతప్పి నడవడం వల్ల అతని ఆరోగ్యం చెడిపోవడమే గాకుండా మాయని మచ్చలు కొన్ని ఏర్పడ్డాయి. అయినప్పటికీ అతను ఉల్లాసంగా హుందాగా అవుపిస్తాడు. ఎప్పుడూ నలుగురితోనూ కలిసి వుండడం అతని కలవాటుకానడంవల్ల అందరికీ అతడొక మోహపుదలా కనిపిస్తాడు; ముఖ్యంగా స్త్రీలకి.

అతనిరాక పెట్రోవిచ్ మహానందం కలిగింది. ప్రపంచ విజ్ఞానం సంపాదించిన ఆ యువరాజు రాక ఒక గౌరవ

చిహ్నంగా భావించాడు పెట్రోవిచ్. అలవాటు ప్రకారం యజమాని ఆ యువరాజుకి తన భూములు భవనాలు వగైరా ఆస్తినంతటినీ. ముఖ్యంగా కుక్కల మందిరాన్ని చూపించి ఆనంద పరిచాడు. కాని పాపం వియరిస్కీ యువరాజుకి ఆ కుక్కల వాతావరణంలో ఊపిరి సలపక ముక్కు రంధ్రాలకి అడ్డుగా చేతిరుమాలు పెట్టుకొని, తొందరగా బయటపడ్డాడు. పాత పద్ధతిలో కొమ్మలు కత్తిరించిన నిమ్మచెట్లతో వున్న తోట, ఎనిమిది కోణాలు గలిగిన సరస్సు, నిలువు దారులూ, యువరాజుకేమీ నచ్చలేదు. అక్కడ వున్న ఇంగ్లీషు మొక్కలు, ప్రకృతి అతనికి నచ్చి వాటిని గురించి చాలా మెచ్చుకున్నాడు. ఇంతలో ఒక నౌకరు వచ్చి భోజనం తయారుగా వుందని చెప్పాడు. ఇద్దరూ ఇంటిదారి పట్టారు. నడిచి నడిచి అలసిపోయిన వియరిస్కీ కొద్దిగా కుంటుకుంటూ నడుస్తూ నేరక యిక్కడికి వచ్చానని పశ్చాత్తాప పడ్డాడు.

కాని భోజనాల గదిలోకి రాగానే మాషా కనిపించే ఈ ముసలి నక్కకి ఆవిడ అందం పరవశం కలిగించింది. పెట్రోవిచ్ మాషాని యువరాజు ప్రక్కన కూర్చోపెట్టేసరికి, ఆవిడ తన ప్రక్క వుండగానే ఇందాకటి అలసట, బాధ అన్నీ పోయి తిరిగి జీవం వచ్చింది. సద్దుకొని మాషాని ఆకర్షించే ట్టు తన సాహస చరిత్రలు కుతూహలంగా చెప్పడం మొదలు పెట్టాడు. పెట్రోవిచ్ స్వారీ చెయ్యడానికి బయల్దేర మన్నాడు. కాని యువరాజు తన ముదుసల్లో నొప్పి వుందని చెప్పి తమాషాగా తప్పించుకున్నాడు. గుర్రపు బగ్గీమీద షికారు పోదామన్నాడు. బండిలో బయల్దేరితే పక్కని

మాషా కూడా వుంటుందని అతని ఆశ. ఇంతలో బండి సిద్ధం చేశాడు. ఇద్దరు వృద్ధులూ, అందాల యువతి మాషా అందులో కూర్చోగానే గుఱ్ఱాలు పరుగెత్తాయి. బాతాఖానీ ఆగకుండా అలా కొనసాగుతూనేవుంది. నాగరికుడైన వియరిస్కీ ఉల్లాసంగా పొగిడే పొగడ్తలన్నీ మాషా సరదాగా వింటోంది. బండి కాలిపోయిన ఇళ్ళ ప్రక్కనించి వెళ్తుండగా వాటిని చూసిన వియరిస్కీ అవెందుకలా కాలిపోయాయని పెట్రోవిచ్‌ని అడిగాడు. పెట్రోవిచ్‌కి ఆ కాలిన ఇళ్ళు కనిపించగానే పాత సంగతులు జ్ఞాపకంవచ్చి కోపం చెలరేగింది. ఆ ఎస్టేటంతా ఇప్పుడు తనదేననీ, ఒకప్పుడు అది డుబ్రోవుస్కీకి చెందినదనీ యువరాజుతో చెప్పాడు.

'డుబ్రోవుస్కీదా!' అని వియరిస్కీ విస్తుపోయి, 'అంటే ఆ గజదొంగేనా.' అన్నాడు.

'అతని తండ్రిది, వాడి తండ్రికూడా అటువంటి వెధవే' అన్నాడు పెట్రోవిచ్.

'అయితే మరి ఈ అగ్గిరాముడు బ్రతికే వున్నాడా? వాణ్ణి పట్టుకున్నారా! ఏమయ్యాడు' అని యువరాజు ఆత్రుతగా అడిగాడు.

"బ్రతికే వున్నాడు మన పత్తేదారులు ఆ దొంగలతో చేతులు కలిపి తిరుగినన్నాళ్ళూ వాడు దొరకడం కష్టం. అన్నట్టు మీ ఆర్బటోవో గ్రామంలోకి కూడా వాడు వచ్చాడట గామాా?" అని పెట్రోవిచ్ అడిగాడు.

'అవును. నిరుడు వాడక్కడ ఏవో దోచుకున్నాడనో తగలబెట్టాడనో విన్నాను. ఏం మాషా! ఈ సాహసచోర

సింహం గురించి వింటుంటే చాలాకుతూహలంగా వుంటుంది కదూ!" అని యువరాజు ప్రశ్నించాడు.

"కుతూహలంగా వుండడమేమిటి? మాషాకి వాణ్ణి బాగా తెలుసు. వాడు మూడు వారాల పాటు అమ్మాయికి సంగీత పాఠాలు చెప్పాడుకూడాను. వాడి దయవల్ల ఆ చెప్పిందానికి ఏమీ పుచ్చుకోకుండా వెళ్లాడు" అని పెట్రోవిచ్ ఫెర్గించి మేష్టారు గురించి జరిగిన కథంతా సవిస్తరంగా చెప్పాడు. అది వింటున్నంతసేపూ మాషాకు ముళ్ళమీద నించున్నట్టుంది. గాని వియదిస్కీ ఆత్రుతగా వింటూ; వాడి కథంతా విడ్డూరంగానే వుందనుకుని మరో విషయం ఎత్తుకున్నాడు. ఇంటికి అంతా తిరిగివచ్చాక పెట్రోవిచ్ యువరాజుని ఆ రాత్రి తన ఇంట్లో వుండమని ఎంతబ్రతిమిలాడినా వినకుండా వియదిస్కీ టీ తాగిన వెంటనే బయల్దేరాడు. వెళ్ళిపోయేముందు యువరాజు పెట్రోవిచ్‌ని ఒకసారిమాషాని తీసుకొని అర్బటోవోలోని తన భవనానికి రమ్మని అహ్వానించాడు. పెట్రోవిచ్ అందుకు అంగీకరించి వస్తానని వాగ్దానం చేశాడు. అతని యువరాజు హోదా, దుస్తులకున్న రెండు నక్షత్రాల గుర్తులు, మూడు వేలమంది నౌకర్లు వీటిని బట్టి వియదిస్కీ తనహోదాకు తీసిపోనివాడని అనుకున్నారు.

రెండు రోజుల తర్వాత పెట్రోవిచ్, మాషాతో వియదిస్కీ యువరాజును చూడ్డానికి వెళ్ళాడు. అర్బటోవ్ గ్రామం చేరాక పెట్రోవిచ్ అక్కడ పరిశుభ్రంగా, కళగా వున్న రైతుల యిళ్ళూ, ఇంగ్లీషువాళ్ళ కోట మాదిరిగా రాతితో

కట్టబడిన యువరాజు మందిరం, చూసి మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు. ఆ మందిరానికి ముందుగా విశాలమైన పచ్చిక మైదానం వుంది. మెడలో వ్రేలాడే టింగుటింగు మనే గంటలు ఊగుతూ వుండగా స్విట్జర్లాండు దేశపు పశువులు ఆ మైదానంలో పచ్చిక మేస్తున్నాయి. భవనంచుట్టూ అన్ని వేపులా దట్టంగా పూలమొక్కల వరుసలున్నాయి. యువరాజు గుమ్మంలో అతిథులిద్దరికీ స్వాగతం చెప్పి, అందాలబాల అయిన మాషాకి చేయి అందించి, లోనికి ఆహ్వానించాడు. వాళ్ళు అద్భుతమైన ఒక గదిలోకి ప్రవేశించారు. అక్కడ ఒక బల్ల, ముగ్గురికి సరిపడే సోఫాలూ వున్నాయి. యువరాజు వాళ్ళని ఒక కిటికీ దగ్గరికి తీసుకువెళ్ళి దాని గుండా కనిపించే మనోహరమైన సుందర దృశ్యాల్ని చూపించాడు. వాళ్లిద్దరూ ఆ సుందర దృశ్యాలు చూచి చాలా మెచ్చుకున్నారు. ఈ భవనం కిటికీల ప్రక్కనించి కొద్ది మాత్రపు దూరంలో రమణీయమైన "వోల్గా" నది ప్రవహిస్తోంది. ఆ నదీ ప్రవాహం మీద తెరచాపలతో పడవలు నిండు బరువుతో ప్రయాణం సాగిస్తున్నాయి. "చావుకోరలు". అని పిలువబడే జాలరుల తెప్పలు నీళ్ళ మీద నాట్యం చేస్తున్నాయి. నది వెనక చాలా దూరంలో కొండలూ, పొలాలూ, అక్కడక్కడ గ్రామాలూ కనిపిస్తున్నాయి.

ఆ తర్వాత ముగ్గురూ, 'చిత్రశాల', అని పిలువబడే ఒక గదిలో ప్రవేశించి చిత్రాలు పరిశీలించారు. యువరాజు విదేశాలలో కొన్న అనేక చిత్రాలు ఆ గది గోడలకి వ్రేలా

డుతున్నాయి. ఒక్కొక్క చిత్రం చూపిస్తూ చిత్రకారుల జీవిత చరిత్రలూ, వాళ్ళ గొప్పతనాలూ తప్పులూ మాషాకి వివరించి యువరాజు చెప్పాడు. అయితే అలా వివరించి చెప్పడంలో మహాపండితులు చెప్పినట్లు చెప్పక ఊహించి చెప్పేవాడు. మాషా కుతూహలంగా ఆనందంగా అతను చెప్పేవి వింటోంది. తర్వాత అక్కడ నుండి బల్ల దగ్గరికి వచ్చారు. యువరాజు ఇచ్చిన ద్రాక్షసారాయి త్రాగడం లోనూ, అతని విజ్ఞానం, నేర్పరితనం కొనియాడడంలోనూ పెట్రొవిచ్ ఏ లోపం రానీయ లేదు. వియరిస్కీని యిప్పటికి రెండుసార్లు మాత్రమే మాషా చూడ్డం జరిగింది. అయినా అతనితో మాట్లాడేటప్పుడు ఆమె కలవరపడలేదు. ఏ ప్రేరే పణ పొందలేదు. భోజనాలయాక యజమాని అతిథులిద్దర్నీ తోటలోనికి తీసుకువెళ్ళాడు. మధ్య మధ్య చిన్న చిన్న మట్టి దిబ్బలతో వున్న పెద్ద సరస్సు గట్టున కూర్చున్నారు. ఇం తలో అకస్మాత్తుగా ఏవో కంచు గంటల మ్రోతలు వినిపిం చాయి. సరస్సు గట్టు దగ్గరికి ఆరు తెడ్లున్న ఒక పడవ వచ్చింది. అందరూ అందులో కూర్చుని పడవ నడుపుతూ కాసేపు సరస్సుమీద విహరించారు. మధ్య మధ్య నున్న మట్టి దిబ్బలు చూశారు. అందులో ఒకదాని మీద పాల రాతి విగ్రహం, ఒకటి పాడైన ఇల్లు... మరొకటి స్థూపం ఆ స్థూపం మీద వింతగా ఏవో అక్షరాలు వ్రాసివున్నాయి. అది చూడగానే మాషాకి ఎంతో కుతూహలం కలిగింది. యువరాజు దానిని గురించి ఏదో చెపుతున్నాడు గాని ఆ చెప్పడంలో అతి నాజూకుగా, నాగరిక భాషలో చెప్పడం

వల్ల ఆవిడకి తృప్తి తీరలేదు. అనుకోకుండా కాలం గడిచి పోయింది. చీకటి పడుతోంది. చలిగాలి వేస్తుందనీ మంచు కురుస్తుందనీ యువరాజు అతిథుల్ని తిరిగి తొందరగా యింట్లోకి తీసుకువెళ్ళాడు. ఆ పూట మట్టుకి యువరాజు మాషాని ఆ ముసలి బ్రహ్మచారి యింట్లో యజమానురాలిగా ప్రవర్తించమని ప్రార్థించాడు. మాషా టీ తయారుచేసి అందరి కప్పులలో పోసింది. ఇంతలో హఠాత్తుగా ఒక పెద్ద శబ్దం వినిపించింది. ఒక తారాచువ్వ లాంటిది వెలిగి ఆకాశమంతా వెలుగుతో నింపింది.

వియరిస్కీ యువరాజు మాషాకి ఒక శాలువయిచ్చి ఆమెనీ పెట్రోవిచ్‌నీ బాల్కనీలోకి తీసుకువెళ్లాడు. యింటి ముందు రంగు రంగుల దీపాలు వెలిగి గిరగిరా తిరిగాయి. మీాదికి దూది పింజంల్లా, గడ్డిపోచల్లా ఎగురుతూ నీళ్లు ధారలుగా పైకి చిమ్మాయి. ఆ యెగిరే నీటి ధారల్లో అనేకమైన రంగులు ఏర్పడ్డాయి. నక్షత్రాల లాంటివి పైకెగిరి ముత్యాలు దీపాల్లా మెరిశాయి. మాషా చంటిదానిలా ఇవన్నీ చూసి ఎంతో సరదా పడింది. ఆవిడ సరదాకి యువరాజు మురిసి పోయాడు. ఇంత జల్సాగా, ఇన్ని విద్యారాలతో హుందాగా గడుపుతున్న యువరాజును పెట్రోవిచ్ మెచ్చుకోని ఇవన్నీ గౌరవ సూచనలుగా భావించాడు. రాత్రి భోజనం కూడా ఎంతో అద్భుతంగా ఏర్పాటుచేశారు. అతిథులు ఎవరి గదుల్లోకి వాళ్లు వెళ్ళిపోయి, మర్నాడుదయం మళ్ళీ కలుసుకుందామనుకున్నారు.

# 14

తనకు ప్రత్యేకించిన గదిలో కిటికీముందు మాషా అల్లిక చట్రం పట్టుకుని కూర్చుంది. అక్కడలా కూర్చున్నా ఆ పిల్ల ధ్యానం మరెక్కడో వుంది. చేస్తున్న పనిమీద దృష్టి నిమగ్నం కావడం లేదు. అయినా చేతిలోని సూది తన అల్లికపని తాను చేసుకుపోతోంది. మాషా పరధ్యానంగా కూర్చుని గుడ్డమీద బొమ్మ అల్లుకుంటూవుంటే హఠాత్తుగా కిటికీలోంచి ఒక చెయ్యి కనిపించింది. చటుక్కున ఆ చెయ్యి అల్లిక గుడ్డమీద ఒక వుత్తరం విసిరివేసి అంతలోనే అదృశ్యమయిపోయింది. మాషా యీ సంఘటనకు నివ్వెరపోయి క్రమక్రమంగా తెలివి తెచ్చుకుంది. ఆ చెయ్యి ఎవరిదోనని బయటకి తొంగిచూసే లోపున యింద్రజాలం పూర్తయిపోయింది. ఆమె ఏదో ఆలోచిస్తూవుండగా లోనుంచి నౌకరు వచ్చి "నాన్నగారు మిమ్మల్ని రమ్మంటున్నారని" చెప్పాడు. మాషా తన తండ్రి గదిలోకి వెళ్ళింది.

గదిలో పెట్రోవిచ్ ఒక్కడూ లేడు. అతని ప్రక్క వియరిస్కీ యువరాజు ఆసీనుడై వున్నాడు. కూతురు గదిలోకి రాగానే పెట్రోవిచ్ ఆప్యాయంగా పిలిచి యిలా అన్నాడు. "మాషా! నీ కొక సంతోషకరమైన వార్త నీకు తగిన వరుణ్ణి చూచాను." వియరిస్కీ మాషాను చూడగానే కలవరపడుతూ లేచి నుంచున్నాడు. మాషా, తండ్రి మాట విని వణికిపోయింది. "యువరాజు వియరిస్కీ నిన్ను పెళ్ళాడాలనుకుంటున్నాడు!" అన్నాడు పెట్రోవిచ్. ఈ

మాట వినగానే మాషా అదిరిపోయింది. తలమీద పిడుగు పడ్డట్టనిపించింది. ముఖమంతా పాలిపోయింది. ఏమీ మాట్లాడ లేక పోయింది. యువరాజు లేచి మెల్లగా ఆమె చెంతకు వచ్చి నిలబడ్డాడు మాషా చేతిని మృదువుగా తాకి అంగీక రించినట్లేకదా!'' అని అడిగాడు. ఆమె నోటివెంట మాట రాలేదు. కంఠస్వరం క్షీణించిపోయింది.

"ఒప్పుకుంటుంది. ఎందుకొప్పుకోదూ తనకు ఒక మగవాడు నచ్చాడని ఏ ఆడది పైకి చెబుతుంది? మౌనం అర్ధాంగీకారం. ఇద్దరూ దంపతులై హాయిగా జీవించండి!'' అంటూ పెట్రోవిచ్ ఆశీర్వదించాడు.

మాషా కొయ్యబారిపోయింది. ముసలిరాజు మాషా చేతిని ముద్దు పెట్టుకున్నాడు. హఠాత్తుగా మాషా కళ్ళనుండి నీళ్ళుబుకి పాలిపోయిన బుగ్గలమీంచి కారాయి. యువరాజు కనుబొమలు చిట్లించాడు. పెట్రోవిచ్ కూతుర్ని కసిరి 'వెళ్ళి కన్నీళ్ళు తుడుచుకొని మళ్ళీ సంతోషంగా తిరిగి రా! పో! ప్రధానం చేసినప్పుడే ఆడవాళ్ళంతా ఇంతే. ఏడుపు మొదలు పెడతారు,' అని యువరాజు వంక తిరిగి, 'అంతా అంతేనండి, అదేమిటో గాని- మనమింక వ్యవహార విషయాలు గురించి అంటే కన్యాశుల్కం గురించి మాటాడుకుందాం''

మాషాకి తండ్రి వెళ్ళిరమ్మనడమే మెఋగయింది. పరుగున గదిలోకి పారిపోయి, తలుపులు బిగించుకుని, వెక్కి- వెక్కి- ఏడ్వడం మొదలు పెట్టింది. కన్నీరు ఏకధారగా కురు స్తోంది. ముసలి వియరిస్కీకి భార్య నవుతానన్న తలంపు వచ్చేసరికి మాషాకి ఆతనంటే తగని అసహ్యం కలిగింది.

ఈ పెళ్ళి చావుకంటె భయంకరంగా కనిపించింది. "అలా వీల్లేదు" అనుకుంది నిస్పృహతో. "అంతకంటె చచ్చిపో-అనాథశరణాలయంలో చేరు, లేదా, దుబ్రోవుస్కీని పెళ్ళాడు" అని తనకి తానే హెచ్చరించుకుంది. ఇంతలో తనకి ఉత్తరం జ్ఞాపకం వచ్చింది. అది దుబ్రోవుస్కీ వ్రాసిందే అయివుంటుందన్న ఆశతో తీసి చదువుకో మొదలుపెట్టింది. అది నిజంగా అతను వ్రాసిందే-కాని ఆ వుత్తరంలో ఈ మాటలు తప్పిస్తే మరేం లేదు. "రాత్రి పది గంటలికి, ఇదివరకటి చోటులోనే"-

# 15

అది ప్రశాంతమైన శరద్రాత్రి. వెన్నెల కురుస్తోంది అప్పుడప్పుడు చల్లనిగాలి తెమ్మెరలు వీస్తున్నాయి. తోటలో ఆకుల గలగలలు వినిపిస్తున్నాయి. అందాల బాల మాషా నిర్ణీత స్థలాన్ని చేరుకుంది. అప్పటికి అక్కడ ఎవ్వరూ కనిపించలేదు. కాని ఇంతలో హఠాత్తుగా నది ఒడ్డునుండి అడుగుల చప్పుడు వినిపించి. మాషా యెదుట దుబ్రోవుస్కీ ప్రత్యక్షమయ్యాడు.

'నాకంతా తెలిసింది మాషా!' అని మెల్లగా అన్నాడు, 'నువ్వు చేసిన ప్రమాణం జ్ఞాపకంవుందా?'

'వుంది. ఆపదలో నువ్వు కాపాడతానని అభయమిచ్చావు. కాని ఒక్క మాట అడుగుతాను-కోప్పడకండి-మీరు నన్నెలా కాపాడగలరు? అదే నా భయం?'

'నువ్వు ఎవరినైతే అసహ్యించు కుంటున్నావో. ఆ మనిషి బారినుండి నిన్ను తప్పిస్తాను మాషా!'

'వద్దు. అతని జోలికి పోకండి. నిజంగా మీరు నన్ను ప్రేమించేవారైతే అతని జోలికి పోవద్దని నా ప్రార్థన. నా వల్ల ఒక అఘాయిత్యం జరుగుతుందంటే నా కిష్టం లేదు.'

"నేను వాడి జోలికేపోను. నీ వుద్దేశ్యం నాకు చాలా పవిత్రమైనది. నీ మూలాన వాడికి ప్రాణ గండం తప్పింది. నీ కోసమని ఇక మీద ఏ దారుణమూ జరగదు. నేను నేరాలు చేస్తున్నా నువ్వు మాత్రం పవిత్రంగా నిల్చిపోవాలి. కాని దుర్మార్గుడైన మీ నాన్న బారినుండి నిన్నెలా తప్పించడం?'

'ఇంకా ఆశ వుంది. కన్నీళ్లతోనూ, ప్రార్థనలతోనూ మా నాన్నగారి మనసు కరిగించగలనన్న ఆశ వుంది. అతనెంత కఠినుడైనా నన్ను దయగా చూస్తాడు.'

'వెర్రి భ్రమ నీది. నువ్వు కన్నీరు కారిస్తే, ప్రేమ కోసం కాక సదుపాయం కోసం పెళ్ళాడబోయే పడుచుపిల్ల లంతా సహజంగా పిరికితనంవల్ల కార్చే కన్నీరు గాబోలను కుంటాడు నీ తండ్రి. నీ ఉద్దేశం ఎలా వున్నా నీ మంచి కోసమే ఈ పెళ్ళి చేస్తున్నానని అతని బుర్రకి తడుతుందనుకో– అప్పుడు? బలాత్కారంగా నిన్ను చర్చిలోకి యీడ్చుకుపోయి, శాశ్వతంగా ఆ ముసిలి మొగుణ్ణి నువ్వు కట్టుకునేట్టు చేస్తాడనుకో–అప్పుడు?'

"అప్పుడా! అప్పుడింక నేనేం చెయ్యగలను. నా గురించి మీరు రండి. మిమ్మల్నే నేను పెళ్ళి చేసుకుంటాను"

ఆ మాటకి డుబ్రోవుస్కీ శరీరం గగుర్పొడిచింది. సిగ్గుతో ముఖం ఎర్రబారింది. కాని మళ్లీ వెంటనే పాలి పోయింది. చాలాసేపు మౌనంగా వుండిపోయారు. తలవంచు కుని ఏవో ఆలోచిస్తున్నాడు.

"ధైర్యం తెచ్చుకో మాషా! శక్తులన్నీ కూడగట్టు కొని మీ నాన్నగారిని బ్రతిమాలు. జీవితమంతా ఒక దుష్టు డైన వృద్ధుడి చేతిలో పడి నీ అందం, ఆనందం ఎలా నాశన మైపోతుందో కళ్ళకి కట్టేటట్టు నీ తండ్రికి చెప్పు. యధార్థం చెప్పడానికి నిశ్చయించుకో. అప్పటికీ అతని మనసు చలిం చకపోతే, నా అభయం వుండనేవుంది. డబ్బు ఒక్క నిము షం పాటైనా తృప్తి యివ్వదనీ, జల్సాలు అలవడతాయనీ, అదైనా మూనాళ్ళ ముచ్చటే అనీ, పాతబడితే రోతే అనీ నచ్చజెప్పు. అతన్ని విడిచిపెట్టకు. బెదరింపులకీ, బొర్జన్యాలకీ, జడియకు. ఏ మాత్రం అతను లొంగుతాడన్న ఆశవున్నా, అధైర్యపడకు. ఇంకే మార్గమూలేనప్పుడు-"

డుబ్రోవుస్కీ ముఖాన్ని చేతుల్లో దాచుకుని గాఢమైన నిట్టూర్పులు విడిచాడు. మాషా వెక్కి వెక్కి యేడ్చింది. డుబ్రోవుస్కీ మనసు విచారంతో నిండిపోయింది.

"మాషా! నేనెంత మందభాగ్యుణ్ణి! కాని నీ కోసం నా జీవితాన్ని కూడా త్యాగం చేస్తాను. దూరాన్నించి నిన్ను చూసినా, నీ చేయి తాకినా ఏదో చెప్పరాని ఆనందం కలుగు తుంది. నీ యెదుట నిల్చి, నా హృదయానికి నిన్ను హత్తు కొని "ఓ దేవతామూర్తీ, మనమిద్దరం కలిసి చనిపోదాం" అని అనాలనిపిస్తుంది; కాని దురదృష్టవంతుడనైన నేను ఆ

ఆనందాన్ని తిరస్కరించాల్సివచ్చింది. అంతులేని యాతనతో బాధను అణుచుకోవల్సి వచ్చింది. వియరిస్కీ అంటే నాలో ద్వేషం రగుల్కొంది. కాని ఆ ద్వేషానికి నా హృదయంలో ఇప్పుడు చోటు లేకుండా పోయింది'' అని బాధపడుతూ డుబ్రోవుస్కీ ఆమెను దగ్గరకు తీసుకొని దుఃఖించాడు. ఆ గజదొంగ భుజంమీద మాషా తల ఆనించి దుఃఖించింది. ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు. కాలం గడిచింది. ఆఖరికి మాషా "నేను వెళ్ళిపోవాలి," అంది.

అప్పటికి గాని డుబ్రోవుస్కీకి మెలుకువరాలేదు. లేచి, మాషా చేయి పట్టుకొని ఆమె వేలికి తనవుంగరం తొడిగాడు.

"నీకు నా సహాయం కావల్సి వచ్చినప్పుడు, ఈ ఉంగరం తెచ్చి ఈ ముళ్ళచెట్టు తొర్రలో పడెయ్యి. తర్వాత నేను చెయ్యవలసిన పని నేను చేస్తాను'' అని చెప్పాడు. డుబ్రోవుస్కీ ఆమె చేతిని ముద్దాడి ఆ చెట్ల గుబురుల్లోపడి మాయమైపోయాడు.

# 16

వియరిస్కీ యువరాజు పెట్రోవిచ్‌కి అల్లుడుకాబోతున్నాడన్న వార్త చుట్టుప్రక్కల ప్రాకిపోయింది. చాలా మంది పెట్రోవిచ్‌కి సంతోషవర్తమానాలు పంపారు. పెళ్ళి ప్రయత్నాలు హడావుడిగా జరుగుతున్నాయి. మాషా మాత్రం తన ఒప్పుదల చెప్పడానికి ఏరోజుకారోజు వాయిదా వేస్తూ వచ్చింది. ముసలి వరుణ్ణి చీదరింపుగానే చూస్తూ అత

నితో కులాసాగా మాట్లాడంలేదు. ఈవిడ ప్రవర్తన పెట్రో విచ్‌కి మాత్రం విసుగు కలిగించలేదు, అతనికి కావల్సింది మాషా వియరిస్కీని ప్రేమిస్తుందా అన్నదికాదు, ఆవిడ మౌనంగా వుంటే అదే అంగీకారమని అతని వుద్దేశం.

ఇలా కొంతకాలం గడిచింది. ఆఖరికి మాషా ఒక నిర్ణయానికి వచ్చింది. వెంటనే యువరాజుకి ఒక ఉత్తరం వ్రాసింది. అతని గొప్పతనాన్ని పొగుడుతూనే అతనిని వివాహం చేసుకుందామనే వుద్దేశ్యం తనకి అణుమాత్రమైనా లేదనీ అందుకు తాను చాలా విచారిస్తున్నానని వ్రాసింది. అటు పిమ్మట తనను వివాహం చేసుకోడానికి అతనిని తిరస్కరించమనీ, తనను కఠినుడైన తండ్రి బారినుండి కాపాడమనీ ప్రార్థించింది. ఉత్తరం ముగించి యువరాజుకు రహస్యంగా అందించింది. యువరాజు ఒంటరిగా కూర్చుని మాషా వ్రాసిన ఉత్తరం చదువుకున్నాడు. కాని పెండ్లి కుమార్తె స్పష్టంగా అసమ్మతి తెలిపినందుకు అతను కొంచమైనా చలించలేదు. పైగా పెండ్లి ప్రయత్నాలు తొందరగా జరిగించ వలసిన అవసరం వుందనుకున్నాడు. అందుకోసమని మాషా తండ్రికి ఈ ఉత్తరం చూపించాలని నిశ్చయించుకున్నాడు.

పెట్రోవిచ్ ఉత్తరం చూచి అగ్గి ఉగ్రుడయ్యాడు. యువరాజు తనీ వుత్తరం పెట్రోవిచ్‌కి చూపించినట్టుమాషాకి తెలియనివ్వద్దని అతికష్టంమీద తెలియజేశాడు. మాషాకి చెప్పకుండా వుండడానికి పెట్రోవిచ్ సమ్మతించాడు గాని ఒక్క నిముషంకూడా వృథాగా పోనీకూడదని నిశ్చయించుకొని, ఆ మర్నాడే పెళ్ళి ముహూర్తం స్థిరపెట్టాడు. వియరి

స్కీకి ఈ ఏర్పాటు చాలా అన్యాయం అని తోచి, పెళ్ళి కుమార్తె దగ్గరికి వెళ్ళి; ఆమె వ్రాసిన ఉత్తరం అతనిని చాలా విచారించేటట్టు చేసిందనీ ఆయినప్పటికీ క్రమేపీ ఆమె అతనిని ప్రేమించగలదనే ఇశిస్తున్నాననీ ఆమెను అతడు విడిచి పెట్టడం అనేది భరింపరాని విషయమనీ; అతని చావును అతనే కోరివరించడం అతనికిష్టంలేదనీ; చెప్పాడు. చెప్పి గౌరవసూచనగా మాషా చేతిని ముద్దుపెట్టుకొని వెళ్ళిపోయాడు. అంతే గాని తండ్రి చేస్తున్న ఏర్పాట్లు గురించి ఒక్కమాటన్నా అనలేదు.

వియరిస్కీ ఆమె గదిదాటి ఇలా వెళ్ళాడో లేదో పెట్రోవిచ్ ఆ గదిలోకి వచ్చి మర్నాడు పెళ్లికి సిద్ధంగా వుండమని నిర్మొహమాటంగా చెప్పాడు. అంతకు ముందే వియరిస్కీ మాటలకు బేజారైన మాషా ఈ పిడుగులాంటి వార్త వినగానే మరింత తల్లడిలిపోయి, కళ్ళనీళ్ళు కారుస్తూ తండ్రి పాదాలమీద పడింది.

"నాన్న! నన్ను నాశనం చెయ్యకండి నాన్న! యువరాజును నేను ఇష్టపడలేదు. అతనికి నేను భార్యని కాలేను. నాన్నా!"

ఇంతవరకూ మౌనంగా వుండి, ఇష్టపడి, ఇప్పుడేమో అంతా స్థిరపెట్టాక; ఏదో ఆవేశించి యిష్టంలేదంటే ఎలా చెల్లుతుంది? ఇటువంటి తెలివితక్కువ వేషాలు నా దగ్గర పనికిరావు. ఇలా కాళ్ళమీద పడ్డంవల్ల ఏం లాభంలేదు" అని పిడుగులు కురిపించాడు.

ఆ అభాగ్యురాలు మరింత విలపిస్తూ బ్రతిమలాడింది. 'నన్ను నాశనం చెయ్యకండి నాన్నా! నన్నెందుకిక్కడనుండి తరిమేసి నాకు నచ్చని ఏ మనిషికో అప్పగిస్తారు? నేను మీకు బరువయ్యానా? ఇంతకు ముందులాగే మీ దగ్గరే వుండి పోతాను. నేను లేకపోతే మీరు చాలా దిగులు పడతారు నాన్నా! నేను మరో యింట దుఃఖిస్తూ వున్నానని తెలిస్తే మరీ దిగులు పడిపోతారు నాన్నా! నన్ను బలవంతం చెయ్యకండి నాకీ పెళ్ళి ఇష్టంలేదు"

పెట్రోవిచ్‌కి కొంచెం కనికరం కలిగింది. అయినప్పటికీ ఆ జాలి మరుగుపరచి, మాషాని త్రోసేసి కఠినంగా అన్నాడు.

'ఈ వాగుడు కట్టించు...విన్నావా?...నీ బాగోగులు నీ కంటె నాకు బాగా తెలుసు కన్నీరు కార్చి ప్రయోజనం లేదు. ఎల్లుండి నీ వివాహం స్థిరపెట్టాను.'

'ఎల్లుండే!!!,' అని గోలపెట్టింది మాషా "అయ్యో దేవుడా! లేదు-లేదు. అది అసాధ్యం ఆలా జరగనివ్వకండి నాన్నా! నా మాట వినండి. చివరికి మీరు నన్ను సర్వ నాశనం చెయ్యడానికే పూనుకుంటే-మీరెన్నడూ అనుకోని ఒక దాత నన్ను రక్షిస్తాడు. నన్ను మీరెంత దారుణం చెయ్యడానికి పీలిస్తున్నారో, తర్వాత మీరే చూస్తారు.

పెట్రోవిచ్ నిప్పుల వర్షం కురిపించాడు.

'ఏమిటేమిటి? బెదిరిస్తున్నావా? నన్ను బెదిరించేపాటి ధైర్యం వచ్చిందే నీకు నీచురాలా! నీ కలలో కూడా అనుకోని దారుణాలు నేను చెయ్యగలనని నేనెంత పనికైనా సమర్థుణ్ణని తెలుసా నీకు? నీకో రక్షకుడున్నాడని నన్ను బెది

రించాలని చూస్తున్నావన్నమాట–ఆ రక్షకుడెవడో తెలుసుకుంటాను కాస్త చెప్పు"

"వ్లాడిమర్ దుబ్రోవ్స్కీ", అంది తెగించి మాషా.

మాషాకి పిచ్చెత్తిందనుకున్నాడు పెట్రోవిచ్ తర్వాత ఇలా అన్నాడు.

'అయితే చాలా మంచిది. నీ రక్షకుడు ఎవడన్నా కానీ, వాడు వచ్చి నిన్ను రక్షించిందాకా ఎదురుచూస్తూ వుండు. కాని అంతవరకూ నువ్వు ఈ గదిలోనే వుండాలి. పెళ్ళి అయిందాకా గదిలోంచి బయటికి మాత్రం కదలడానికి వీల్లేదు."

ఈ మాటలంటూ పెట్రోవిచ్ గదిలోంచి బయటికి వచ్చి బయట తలుపులికి తాళం వేశాడు.

మందభాగ్యురాలైన మాషా చాలా సేపు వెక్కి వెక్కి ఏడ్చింది రాబోయే ఆపదలన్నీ తలంపుకు తెచ్చుకొంటోంది. ఇప్పుడు జరిగిన పిడుగుల వర్షం కొంతవరకు ఆవిడకి విడుదల కలిగించి, తను ఎదుర్కోవలసిన ప్రమాదాలను జ్ఞాపకం తెచ్చింది. చేయవలసిన పనుల తీరును ఆలోచించడానికి అవకాశం కలిగించింది. తనకి ముఖ్యంగా కావలిసింది ఈ బలవంతపు–పెళ్ళి నించి తప్పించుకోవడం, అంతకంటె దోపిడి దొంగకి భార్య కావడం మాషాకి స్వర్గంగా తోచింది. దుబ్రోవ్స్కీ తనకిచ్చిన ఉంగరాన్ని చూసుకుంది. ఈ పెళ్ళి యేర్పాటు జరక్కముందే ఒకసారి దుబ్రోవ్స్కీని కలుసుకొని, తీరికగా అతనితో ఏంచెయ్య వలసిందీ మాటాడుకుంటే బాగుంటుందనిపించింది. అతనారాత్రి తోటలో నదిగట్టున

కనిపిస్తాడని ఎందుకో అనిపించింది. చీకటి పడగానే అక్కడికి వెళ్ళి అతనిని కలుసుకోవాలని నిశ్చయించుకుంది.

చీకటిపడింది. మాషా బయల్దేరడానికి సిద్ధమయింది. కాని తలుపుకి తాళం వేసివుంది. తలుపవతలనుంచి దాసీది పలకరించి, మాషాని బయటికి వెళ్ళనివ్వద్దని వాళ్ళందరికీ తండ్రి ఆజ్ఞాపించాడని చెప్పింది. మాషా ఖైదీ అయింది. పూర్తిగా నిరాశపొంది కిటికీ దగ్గర సోఫాలో కూలబడింది. బట్టలన్నా మార్చుకోకుండా తెల్లవార్లూ అలా ఆకాశం అంతటా ఆవరించిన చీకటి వేపు చూస్తూ శూన్యంగా కూర్చుండి పోయింది. వేకువజామున చిన్న కునుకు పట్టింది. కాని నిద్రలోకూడా విషాద ఘట్టాలే కనిపించాయి. ఇంతలోనే ఉదయిస్తున్న సూర్యుడి కిరణాలు మాషాని మేలుకొలిపాయి.

# 17

కళ్లు విప్పి చూసేసరికి, తనొక ఖైదీగా బంధించబడినట్టు తెలిసింది. ఇది మాషాకి దారుణంగా కనిపించింది. గంట వాయించింది. బయటనించి దాసీది జవాబిచ్చింది. పెట్రోవిచ్ గత సాయంత్రం ఆర్బటోవ్ గ్రామానికి వెళ్ళి, చాలా ఆలస్యంగా తిరిగి వచ్చి, మాషాని గది బయటికి వెళ్ళనివ్వకూడదని, ఎవరితోనూ మాటాడనివ్వరాదని పరిచారికలందరికీ ఆజ్ఞాపించాడని; పెళ్ళికోసమని ప్రత్యేకమైన ఏర్పాట్లేవీ అతను చేయిస్తున్నట్టు కనిపించడంలేదనీ ఒక్క-

పెళ్ళి బ్రాహ్మణుడిని మాత్రం ఏ పరిస్థితుల్లోనూ ఊరు విడిచి వెళ్ళడానికి వీలులేదని శాసించారనీ దాసీది చెప్పింది. ఈ వార్త చెప్పి దాసీది మాషాని ఒంటరిగా విడిచి వెళ్ళిపోయింది.

అమాయకురాలైన ఖైదీ హృదయానికి ఈ మాట లన్నీ శూలాలవలె గుచ్చుకున్నాయి. కోపంతో ఆమె నెత్తురు ఉడుకెత్తింది. ఇవన్నీ దుబ్రోవ్‌స్కీకి తెలిసేలా చెయ్యాలని పట్టుదల వహించింది. మర్రిచెట్టు తొర్రలో ఆ వుంగరం ఎలా పడవేయించడమా అని ఉపాయాలు వెదకడం మొదలు పెట్టింది. ఇంతలో కిటికీ అద్దానికి ఏదో రాయి తగిలి చప్పుడై తన ఆలోచనలకి అంతరాయం కలిగించింది. మాషా తొంగి చూసింది. తమ్ముడు సాషా రహస్యంగా కిటికీ దగ్గరికి వచ్చాడు. సాషాని చూసేసరికి అభిమానం రేకెత్తి మాషాకి చాలా ఆనందం కల్గింది. వెంటనే కిటికీ తెరిచింది.

"ఏం సాషా! ఏం వచ్చావు?"

"నీకేమైనా కావాలేమో తెలుసుకుందామని వచ్చానక్కయ్యా! నాన్న చాలా కఠినంగా నువ్వేం అడిగినా ఎవరూ మాటాడొద్దని చెప్పారు. కాని నీ కేం కావలసినా నేను చేస్తాను. చెప్పక్కయ్యా!"

'నీకు నేనంటే ఎంత ప్రేమ! అయితే విను సాషా! చూడు, ఆ నది గట్టున వుండే మర్రిచెట్టు! ఆ చెట్టుకి పెద్ద తొర్రవుంది. నువ్వెప్పుడన్నా చూశావా?"

'ఓ... చూశానక్కా!'

'అయితే నీకు నామీద నిజంగా ప్రేమవుంటే ఈ పని చేసిపెట్టు. నువ్వెంత తొందరగా వెళ్ళగలిగితే అంత

తొందరగా వెళ్ళి, ఆ మర్రిచెట్టు తొర్రలో యీ వుంగరం పడేసిరా–ఎవరూ చూడకుండా మరీ పడేసిరా! తెలిసిందా"

అని వుంగరం సాషా చేతికిచ్చి, కిటికీ తలుపులు మూసేసింది. సాషా వుంగరం పట్టుకొని పరుగెత్తాడు. మూడు నిముషాలకల్లా మర్రిచెట్టు దగ్గరికి చేరాడు. పరుగెత్తి వచ్చాడేమో అలసట తీర్చుకుని, కాస్సేపాగి, తొర్రలో వుంగరం పడేసేముందు చుట్టూ ఒకసారి చూసి, తర్వాత పడేశాడు. తిరిగి వెంటనే వెళ్ళి తను విజయవంతంగా నెరవేర్చిన పని అక్కయ్యతో చెపుదామనుకొని బయల్దేరాడు. ఇంతలో నది గట్టు నుండి తటాలున ఒక చినిగిన పేలికలు వేసుకున్న, ఎర్రని జుత్తుగల, మెల్లకంటి కుర్రవాడొకడు వచ్చి, మర్రి చెట్టు దగ్గరికి పరుగెత్తి తొర్రలో చెయ్యి పెట్టడం సాషా కంట బడింది. వెంటనే ఉడతలాగా చెంగున వాడి మీదికి దుమికి రెండు చేతులతో వాణ్ణి పట్టుకున్నాడు.

"ఏం చేస్తున్నావ్?" అని కోపంగా అడిగాడు.

"నీ కెందుకు?" అన్నాడు ఆ కుర్రవాడు పట్టువిడిపించుకోడానికి ప్రయత్నిస్తూ.

"ముందా వుంగరం అందులో పడెయ్యి–మెల్లకన్నా రాగిజుత్తూ, నువ్వూన్నా–లేదా తగినట్టు బుద్ధి చెప్తాను మరెప్పుడూ మరిచిపోకుండా," అని సాషా బెదిరించాడు.

జవాబుగా ఆ రాలుగాయి సాషాముఖంమీదకొట్టాడు. సాషా పిడికిలితో దెబ్బలు తగలకుండా తప్పించుకుంటూ బిగ్గరగా కేకలు వేశాడు "దొంగ! దొంగ," రాలుగాయి తప్పించుకోవాలని శతవిధాలా ప్రయత్నించాడు. సాషాకంటె

వాడు రెండేళ్ళు పెద్దవాడు. సాషా కంటె బలవంతుడు. కాని సాషాయే చాలా చురుకైనవాడిలా వున్నాడు. కొంతే సేపు ఇద్దరూ కొట్లాడుకున్నారు. చివరికి రాలుగాయి రాగిజుట్టు కుర్రాడు తనదేపై చేయి అనిపించుకున్నాడు. ఒక్క వురుకు వురికి, సాషాని పట్టుకొని కిందికి త్రోసేసి మెడపట్టుకున్నాడు.

కాని ఇంతలో ఆకస్మాత్తుగా ఒక బలమైన చెయ్యి వాడి రాగిజుట్టు పట్టుకొని పైకి లేవదీశాడు.

"ఏంరా రాగిజుట్టు వెధవా, చిన్న అబ్బాయిగారిని కొట్టేటంత మొనగాడివయ్యావురా, రాలుగాయి!" అని గద్దించాడు తోటమాలి. సాషాకి ధైర్యం వచ్చింది. పౌరుషంతో ఇలా అన్నాడు రాగిజుట్టురాలుగాయితో.

'నువ్వు సమంగా నాతో దెబ్బలాడగలిగితే నన్ను కింద పడెయ్యడం నీ తరంగాదు తెలుసా? ఆ వుంగరం మర్యాదగా ఇలా ఇచ్చేసి తిన్నగా వెళ్లు"

"ఇవ్వడం జరగదు" అని రాలుగాయి గభాలున గిరగిరా తిరిగి; తోటమాలి చేతుల్లోంచి జుట్టు తప్పించుకున్నాడు. వెంటనే దాడు లంకించుకున్నాడు. కాని సాషా వాడిని పట్టుకుని వీపుమీద ఒక్కతన్ను తన్నేసరికి ఆ రాలుగాయి నేల మీద బోర్లపడ్డాడు. తోటమాలి స్టెపాన్ మళ్ళీవాణ్ణి పట్టుకుని తన పట్కాతో వాణ్ణి కట్టేశాడు.

'ఉంగరం ఇయ్యి,' అని సాషా మళ్ళీ గద్దించాడు.

'ఒక్క నిముషం ఆగండి బాబుగారూ!' అని స్టెపాన్ బోధపరిచి; మునసబు దగ్గరికి వీణ్ణి తీసుకెళ్ళి శిక్ష వేయిద్దాం' అని చెప్పాడు.

తోటమాలి ఖైదీని తీసుకుని సాషాతోబాటు ఇంటి వేపు దారితీశాడు. ఇంటికి దగ్గరగా వచ్చేసరికి సాషా తన చిరిగిన బట్టలవేపూ, గడ్డిపరకలు అంటుకున్న నిక్కరువేపూ భయంగా చూశాడు. ఇంతలో అప్పుడే గుర్రాల శాలలు తణిఖీ చేసుకుంటూ వస్తూన్న పెట్రోవిచ్‌కి వీళ్ళు ముగ్గురూ ఎదురుపడి పోయారు.

'ఏమిటిదంతా!' అని స్టెపాన్‌ని అడిగాడు,

స్టెపాన్ జరిగిన సంగతి చెప్పాడు పెట్రోవిచ్ స్టెపాన్ చెప్పిందంతా శ్రద్ధగా విన్నాడు.

'ఏంరా వెధవా! వీడితో నువ్వెందుకు కూడావ్ రా?' అని సాషాని గద్దించాడు.

'ఆ చెట్టు తొర్రలోని వుంగరం వీడు తీసుకున్నాడు అది ఇచ్చెయ్యమనండి.'

"చెట్టుతొర్రేమిటి, అందులో వుంగరమేమిటిరా?"

"మాషా అక్కయ్య-కాదు ... వుంగరం-" అనిసాషా నాలిక కరుచుకుని మాటలు మార్చాడు. తొట్రుపాటు పడ్డాడు. పెట్రోవిచ్ కనుబొమలెగ్రజేసి తల ఆడించాడు.

"ఇందులో మాషా కూడా వుందన్నమాట! అంతా చెప్పు లేదా కొరడా దెబ్బలు కొట్టానంటే మీ అమ్మ దిగి రావాలి"

నాతో ఏ పనీ చేయమని చెప్పలేదు.

"ఒరే స్టెపాన్! వెళ్ళి రెండు మాంచి చింతరువ్వలు విరిచి పట్టుకురారా!"

"ఉండండి నాన్నా అంతా చెప్పేస్తాను - పొద్దుట ఇంట్లో పరుగెడుతూ ఆడుకుంటూంటే; మాషా అక్కయ్య కిటికీ తెరిచింది. నే నటువేపు వెళ్తుంటే అక్కయ్య వుంగరం పడేసింది; ఆ వుంగరం ఈ తొర్రలో దాచుతుంటే, ఈ రాగిజుత్తుగాడు దొంగిలించాలనుకున్నాడు.'

మాషా వుంగరం పడేసిందా, నువ్వేమో అది దాచుకున్నావా? ఏదిరా స్టైపాన్! ఏవీ! ఆ చింతరువ్వలు ఇలా పట్టుకురా."

'ఉండండి అంతా చెప్పేస్తాను. మాషా అక్కయ్య ఏమో ఈ మర్రిచెట్టుతొర్రలో ఆ వుంగరం పడెయ్యమని చెప్పింది. నేను అందులో పడేశాను. ఈ వెధవ దాన్ని-

'ఎవరి కుర్రాడివి నువ్వు?'

'డుబ్రోవుస్కీ నౌకర్లలో నేనొకణ్ణి,' అన్నాడా రాగి జుత్తురాలుగాయి. అనగానే పెట్రోవిచ్ ముఖం నల్లబడింది.

"అయితే నన్ను యజమానిగా నువ్వు గుర్తించడం లేదన్నమాట? సరే-చాలా బాగుంది. మా తోటలోకి వచ్చి నువ్వేం చేస్తున్నట్టు?'

పళ్ళు ఏరుకుంటున్నానండి అని వట్టి అమాయకంగా జవాబిచ్చాడు.

ఓహో! యజమానికితగ్గ నౌకరివి. గుంపును బట్టి నాయకుడు. మా తోటలో మర్రిచెట్టుకింద పళ్లు ఏరుకుంటున్నావన్నమాట?"

వాడేమీ జవాబివ్వలేదు.

"వాడ్ని నా వుంగరం ఇచ్చెయ్యమనండి" అన్నాడు సాషా!

'నోర్మూయ్ నీ పనికూడా పడతానుండు. తొందర పడకు. నీ గదిలోకి పో...ఊఁ... వెళ్లు. ఏంరా పిల్లకన్నా! చురుకైన అబ్బాయిలాగున్నావే. ఆ వుంగరం యిలాగిచ్చి దాడుతెయ్యి...'

అని పెట్రోవిచ్ అనడమే తడవుగా ఆ రాలుగాయి పిడికిలి విప్పి చూపించాడు. అందులో వుంగరం లేదు.

'నిజం చెప్పితే నీకు కొరడా దెబ్బలు తప్పుతాయి. అంతేగాదు. నీకు ఏమన్నా కొనుక్కోడానికి అయిదు కోపెక్కులు ఇస్తాను. లేదా వీపు చిట్లిపోతుంది తెలుసా?"

రాలుగాయి కుర్రాడు ఒక్క మాటన్నా అనలేదు. తలవంచుకుని పల్లెటూరి రైతులా నించున్నాడు. పెట్రోవిచ్ స్టెపాన్‌ని పిలిచి "సరే వీడిని బంధించి, ఎక్కడికీ పారిపోకుండా చూడు. పారిపోయాడో మీ అందరి భరతం పడతాను" స్టెపాన్ రాలుగాయిని పావురాపిట్టల గూళ్ళ దగ్గరికి నడిపించి తీసుకువెళ్ళి, అక్కడ పిట్టల్నిచూసే 'అగాఫ్యా' అనే ముసలిదాన్ని చూడమని కాపలావుంచి, రాలుగాయిని అక్కడ బంధించాడు.

వెంటనే ఊళ్లోకి వెళ్ళి, పత్తేదారుని పిల్చుకురా", అన్నాడు పెట్రోవిచ్. అతను వెళ్ళాక తనలో ఇలా అనుకున్నాడు.

ఇందులో సందేహం ఏమీలేదు. ఆ డుబ్రోవుస్కీతో దీనికి స్నేహం వుండే వుంటుంది. నిజంగా మాషా వాడి సహాయాన్నికోరే ఇలా చేసివుంటుందా? చివరికి వాడిని పసిపట్టగలిగాను. ఇంక వాడు నన్ను తప్పించుకోలేడు. ఈ అదను విడిచిపెట్టకూడదు. అదిగో బండి చప్పుడు. పత్తేదారు వచ్చేసినట్టున్నాడు.' అనుకుని "ఏడీ ఆ రాలుగాయి వెధవనిలా తీసుకురండి' అని ఆజ్ఞాపించాడు.

అప్పుడే ఇంటిముందొక బండి ఆగి, అందులోంచి పత్తేదారు నేస్తం దిగి గదిలోకి దుమ్ముగేగిన బట్టలతో వచ్చాడు.

'గొప్ప వార్త. డుబ్రోవుస్కీని పట్టుకున్నాను," అన్నాడు పెట్రోవిచ్

"హమ్మయ్య బరువు తీరింది." అని పత్తేదారు విప్పారిన ముఖంతో ఆనందం పట్టలేక అడిగాడు, 'ఏడీ ఎక్కడున్నాడండీ?'.

'డుబ్రోవుస్కీ కాదనుకో. వాడి ముఠాలో ఒకణ్ణి పట్టాను," అన్నాడు. పెట్రోవిచ్, 'ఒక నిముషంలో వాణ్ణి తీసుకు వస్తారు. మూల పురుషుణ్ణి పట్టుకోవడంలో వీడే తోడ్పడతాడు. అదుగో వచ్చాడు."

పత్తేదారు, భయంకర చోరుడెవడో వస్తున్నాడని ఎదురు చూస్తున్న వాడల్లా ఆఖరికి అమాయకంగా, నీరసంగా కనిపిస్తున్న పదమూడేళ్ళ పసివాడు కనిపించేసరికి నివ్వెరపోయి, పెట్రోవిచ్ వేపు తెల్లబోయి చూశాడు. ఏమిటి చెబుతాడా అని ఎదురుచూస్తున్నాడు. వెంటనే పెట్రోవిచ్ ఇందాక

జరిగిన సంగతి యావత్తూ అతనికి చెప్పాడు. గాని మాషా విషయం మాత్రం ఎత్తలేదు.

పత్తేదారు అంతా విస్తారంగా వింటూ, ఆ కుర్ర దొంగవేపు చూపులు మళ్ళించాడు. వాడింకా పల్లెటూరి రైతులాగే ప్రవర్తిస్తూ అసలు అక్కడ ఏం జరుగుతున్నదీ పట్టించుకున్నట్టే అవుపించడంలేదు. పెట్రోవిచ్ వాడిని మరో గదిలోకి తీసుకుపోయి తలుపులికి తాళం వేశాడు.

"అయ్యా, మీతో రహస్యంగా ఒక విషయం మాట్లాడాలి" అన్నాడు పత్తేదారు. ఇద్దరూ బయటికి వెళ్ళి, అరగంటలో తిరిగివచ్చి రాలుగాయి వున్న గది తాళం తీసి లోపలికి ప్రవేశించారు. అదృష్టం ఎలా వుంటే అలా వుంటుందని ఆ రాలుగాయి నిశ్చయం చేసుకున్నాడు. పత్తేదారు వాడితో ఇలా అన్నాడు.

'దొరగారు నిన్ను కొరడాలతో కొట్టించి జైలులో పెట్టించమని చెప్పారు. తర్వాత ఈ దేశం నుంచి తరిమెయ్యమన్నారు. కాని నేను నీ తరఫున మాటాడి దొరగారిని మన్నించమని ప్రార్థించాను. వారు సరే నన్నారు. నీకు విడుదల యిచ్చారు."

రాలుగాయికి కట్టినకట్లు విప్పారు,

"దొరగారికి సలాములు చేసుకో" అన్నాడు పత్తేదారు.

కుర్రాడు పెట్రోవిచ్ దగ్గరికి వెళ్ళి కృతజ్ఞత తెలియజేస్తూ అతని చేతిని ముద్దుపెట్టుకున్నాడు.

'ఇంటికి పోవచ్చు నువ్వింక! ఇంకెప్పుడూ మరి చెట్టు తోపులలో జామిపళ్ళు దొంగలాడకేం?' అని పెట్రోవిచ్ సెలవిచ్చాడు.

కుర్రాడు సంతోషంగా పరుగెత్తి గుమ్మందాటి, వెనక్కిమరి చూడకుండా కిస్టెనెవకా తోటల్లోపడి ఒకటే దౌడు లంకించుకున్నాడు. పల్లె యింటి దగ్గరికి వచ్చి కిటికీ అద్దాలు తట్టాడు కిటికీ తెరవ బడింది. ఒక ముసలమ్మ కిటికీ దగ్గర నిలబడింది.

రొట్టె కావాలి గ్రానీ! ప్రొద్దుటినించీ ఏమీ తినలేదవ్వా! చాలా ఆకలేస్తోంది. అన్నాడు రాగిజుత్తు రాలుగాయి.

ఓరి నువ్వట్రా మిట్యా! ఇంతసేపూ ఎక్కడున్నావురా నాపసన్నాసీ! అని ముసలమ్మ గ్రానీ కోప్పడింది.

అదంతా తర్వాత చెప్తానులే-గ్రానీ! ముందు రొట్టె యిద్దూ నీకు పుణ్యముంటుంది. అన్నాడు మిట్యా.

ఏం మాటల పోగువురా, అని ముసలవ్వ సణుక్కుంటూ, ఊఁ ఇదిగో తగలబడు. అని ఒక నల్లటి రొట్టెముక్క కిటికీ లోంచి విసిరింది.

మిట్యా రొట్టెని ఆత్రుతగా కొరికి. నవులుకుంటూ నడిచాడు.

చీకటి పడబోతుంది. వరిచేలూ, కూరగాయలచేలూ దాటుకుంటూ పోయి, మిట్యా కిస్టెనెవకా తోటలోని చింత చెట్ల గుబురులోకి చేరాడు. ఆ గుబురుల మధ్యనున్న రెండు దట్టమైన రావిచెట్ల దగ్గర నిలబడి, ఒకసారి చుట్టూచూశాడు.

కాస్సేపాగి, ఒక చిన్న ఈల వేశాడు. చెవి ఒగ్గి వింటు న్నాడు. ఇంతలో జవాబుగా దూరాన్నుంచి ఈలవినిపించింది. ఎవరో ఆ గుబురులోంచి బయటపడి వచ్చి, మిట్యాని సమీపించాడు.

# 18

పెట్రోవిచ్ మామూలు కంటె ఎక్కువ స్వరంతో ఈల పాడుతూ గదిలో ఇటూ అటూ పచారు చేస్తున్నాడు. ఇల్లంతా సందడిగా వుంది. మగనౌకర్లు అటూఇటూ హడావుడిగా తిరుగుతున్నారు. దాసీలు నానా కోలాహలం చేస్తున్నారు. గుర్రాల సాలలో బండివాళ్ళు రథానికి గుర్రాలు కట్టి సిద్ధం చేస్తున్నారు. చావిళ్ళన్నీ మగవాళ్ళతోనూ ఆడవాళ్ళతోనూ క్రిక్కిరిసి వున్నాయి. అంతఃపురంలో అద్దం ముందు నించొని ఒక దాసీది పరిచారికలను చుట్టూవుంచుకొని, కళాకాంతులు లేని ప్రతిమలా కూర్చున్న మాషాని అలంకరిస్తోంది. వజ్రాలహారాల బరువుతో మాషా మెడ వంచుకొని బొమ్మలా కూర్చుంది. పిన్నులు గ్రుచ్చడంలో ఎవరన్నా అజాగ్రత్తగా వంటికి తగిలి నొప్పించేటప్పుడు మాత్రం కొంచెం కదిలేది. కాని ఏమీ అనేదికాదు. అద్దంలోకి శూన్యంగా చూసేది.

కాస్త తొందరగా తెముల్చుకొని రాగలవా, అన్న పెట్రోవిచ్ మాటలు బయటనించి వినిపించాయి. అలంకరించే దాసీది జవాబిచ్చింది.

చిత్రం! ఒక్క నిముషం; అని మనవి చేశాక, మాషా వంక తిరిగి, లేచి నించొని అద్దంలో చూసుకోండమ్మగారూ! అంతా మీకు నచ్చినట్లేనా? అని ప్రశ్నించింది. కాని మాషా ఒక్క మాటన్నా అనకుండా లేచి నిలబడింది. తలుపులు తెరవ బడ్డాయి

పెళ్ళికూతురు సిద్ధంగా వుంది. రథంమీదికి ఎక్కించ వచ్చును. అని దాసి మనవి చేసింది.

'భగద్విలాసం ఎవరూ తప్పించలేం,' అని పెట్రోవిచ్ టేబిలు మీదున్న బొమ్మని పట్టుకుని చూస్తూ, మాషా వంక తిరిగి, మాషా ఇలా రా అమ్మా, నిన్ను ఆశీర్వదించి పంపిస్తాను అని ఎంతో ప్రేమగా పిలిచాడు.

పాపం ఆ బేలబాలిక బావురుమని ఏడుస్తూ అతని కాళ్ళమీద పడింది, 'నాన్నా నాన్నా' అంటూ కన్నీరు కార్చింది. గొంతుకలో స్వరం చచ్చిపోయింది!

తొందర తొందరగా పెట్రోవిచ్ ఆశీర్వదించాడు. పరిచారికలు మాషాని ఎత్తుకుని రథంమీద కూర్చొండ బెట్టారు. మాషా ప్రక్కన్కి ఒక ముత్తైదువ, ఒక దాసీది కూర్చున్నారు. బండి సరాసరి చర్చి దగ్గరికి పోనిచ్చారు అప్పటికి అక్కడ పెళ్ళికొడుకు తయారై వీళ్ళకోసం ఎదురు చూస్తున్నాడు. పెళ్ళి కూతురుని పలుకరిద్దామని వచ్చాడు. కాని మాషా ముఖంలో కళాకాంతులు లేకపోవడం, వింత ధోరణిలో మాట్లాడ్డం అతని ఉత్సాహాన్ని తగ్గించాయి. అందరూ కలిసి ఖాళీగావున్న చర్చిలోకి వెళ్ళారు. లోపల గొళ్ళెం పెట్టారు. మత గురువు పూజా మందిరం వద్దకువచ్చి

మంత్రాలు ప్రారంభించాడు. మాషాకి ఏదీ కనిపించడంలేదు మరేదీ వినిపించడంలేదు; ఒక్క విషయం గురించి మాత్రమే ఆలోచిస్తోంది. ప్రొద్దుటి నుంచీ దుబ్రోవుస్కీ వస్తాడని ఎదురు చూస్తోంది. ఆశ మాత్రం ఇంకా పోలేదు. కాని మతగురువు మాషా దగ్గరికి వచ్చి ఏవో ప్రశ్నలు వేశాడు. మాషా వణికి పోయింది; జవాబులు చెప్పకుండా ఆలస్యం చేస్తూ ఇంకా దుబ్రోవుస్కీ వస్తాడన్న ఆశతో ఎదురు చూస్తోంది. కాని మతగురువు మాషా జవాబులకోసం ఎదురుచూడకుండానే పెళ్ళి కార్యం జరిగిపోయిందనీ, మాషా వియరిస్కీలు దంపతులై పోయారని ప్రకటించాడు.

పెళ్ళి తంతు ముగిసిపోయింది. తనకు నచ్చని తనభర్త తన చేతిని ముద్దుపెట్టుకున్నాడు. చుట్టూవున్న వాళ్ళంతా ఆనందంగా అభినందించారు. అయినా తనొకరి భార్యనై పోయానని తను నమ్మలేకపోయింది. దుబ్రోవుస్కీ తనని రక్షించడానికి రాలేదని వాపోయింది. యువరాజు ప్రేమగా ఆమెతో మాట్లాడాడు గాని అతని మాటలే ఆమెకి వినిపించ లేదు. అందరూ చర్చి బయటికి వచ్చారు. పొక్రోవుస్కోయి రైతులంతా గుమ్మాల ముందు నించొని చూస్తున్నారు. మాషా చూపులు వాళ్ళందరి వేపూ తిరిగి మళ్లీ శూన్యం లోకి మళ్లిపోయాయి. నూతన దంపతులు బండిలో ఒకరి ప్రక్కన ఒకరు కూర్చున్నారు. బండి ఆర్బటోవు గ్రామం వేపు పరుగెత్తింది. పెట్రోవిచ్ అంతకు ముందే ఆర్బటోవ్‌కి వెళ్ళిపోయి, అక్కడ అంతా సిద్ధంచేయించి, వాళ్ళకోసం ఎదురుచూస్తున్నాడు. ప్రతిమలా మౌనంగా దీనంగా

కూర్చున్న మాషాని చూసి బండిలో కూర్చున్న యువరాజేమీ బాధపడలేదు. సరదాగా ఆమెతో మాట్లాడాలనిగానీ, ప్రేమగా హాస్యాలాడదామనిగానీ ప్రయత్నించనైనాలేదు, ఈ విధంగా వాళ్లు పది మైళ్లు దాటారు. అక్కడ నించి దారి బాగాలేదు. గుతకల్లో బండి పడినప్పుడల్లా కుదుపువచ్చి పడేది. ఇంతలో అకస్మాత్తుగా భయంతో కేకలు వినిపించాయి. బండి ఆగిపోయింది. ఆయుధాలు ధరించిన కొంతమంది బండిని చుట్టుముట్టారు. మాషా కూర్చున్న వేపున్న తలుపుతీసి, ఒక ముసుగు మునిషి, ఇలా అన్నాడు.

"నీ కిప్పుడు భయం తీరింది. బయటికి వచ్చెయ్యి"

'ఏమిటిది? ఎవరు నువ్వు?' అని యువరాజు ప్రశ్నించాడు.

'అతనే డుబ్రోవుస్కీ' అని మాషా జవాబిచ్చింది.

యువరాజు తొట్రుపడకుండా, స్థిమితం తెచ్చుకుని ప్రక్క జేబులోవున్న పిస్తోలు తీసి, ముసుగులో వున్న దోపిడి దొంగ వేపు గురిపెట్టి పేల్చాడు. కెవ్వుమని మాషా కేక వేసి భయంతో చేతుల్లో ముఖాన్ని దాచుకుంది. డుబ్రోవుస్కీకి భుజంమీద గాయం తగిలి రక్తం కారసాగింది. యువరాజు క్షణమైనా అలస్యం చెయ్యకుండా మరొక పిస్తోలు తీశాడు; కాని అతను మళ్ళీ పేల్చకముందే, బండి తలుపులు తెరచి కొన్ని బలమైన చేతులు అతని పిస్తోలును లాక్కొని అతన్ని బయటికి లాక్కొచ్చాయి. అతని తల చుట్టూ విచ్చు కత్తులు ధగధగా మెరిశాయి.

'అతన్నేమీ చెయ్యకండి,' అని డుబ్రోవ్స్కీ ఆజ్ఞాపించగానే అతని బృందం ఆగిపోయారు. మాషాని చూసి, 'నువ్వింక విముదల అయినట్టే,' అన్నాడు గజదొంగ.

'లేదు సమయం మించిపోయింది. నాకు పెళ్ళయిపోయింది. నేను వియారిస్కీ యువరాజు భార్యనయిపోయాను,' అన్నది మాషా.

'ఏమిటీ!' అని డుబ్రోవ్స్కీ నిర్ఘాంతపోయి, "లేదు: నువ్వు అతని భార్యవి కాలేదు. నిన్ను బలవంతం చేశారు. నువ్వు దీనికి సమ్మతించలేదు..." అన్నాడు.

"నేను సమ్మతించాను. ప్రమాణం చేశాను. యువరాజే నా భర్త! అతన్ని విడిచిపెట్టమని చెప్పండి. నన్ను అతనితో విడిచిపెట్టండి. నేను మిమ్మల్ని మోసగించలేదు. చివరి ఘడియదాకా మీ కోసం ఎదురు చూశాను. కాని ఇప్పుడు సమయం మించిపోయింది. అంచాత మా దారిని మమ్మల్ని పోనివ్వండి," అన మాషా ధైర్యంగా చెప్పింది.

డుబ్రోవ్స్కీ మరి వినదలుచుకోలేదు. ఒక ప్రక్క భుజంమీద తగిలిన గాయం కలిగిస్తున్న బాధా, మరో ప్రక్క ఇప్పుడు తన హృదయంలో చెలరేగుతున్న తుపాను అతనిలో వున్న శక్తులన్నిటినీ పోగొట్టాయి. శక్తిహీనుడై డుబ్రోవ్స్కీ రథచక్రం ప్రక్క ఒరిగి పడిపోయాడు. అతని పరివారం చుట్టుముట్టారు. ఏవో కొన్ని మాటలు మాత్రమే అతను పరివారంతో మాటాడగలిగాడు. వాళ్లు అతన్ని గుర్రం మీద కూర్చుండబెట్టారు. ఇద్దరు ఊతయివ్వగా మరొకరు కళ్లెం పట్టుకున్నాడు. మిగతా వాళ్ళంతా వెంట

నడిచారు. రోడ్డు మధ్యని బండిని విడిచిపెట్టారు. గుర్రాల్ని విడదీసి వదిలేసి నౌకర్లని కట్టేసి పడేశారు. తమ నాయకుడి రక్తానికి, పగతీర్చుకునేందుకు ఒక్క నెత్తురు చుక్కనైనా రాల్చనివ్వలేదు. ఒక్క పూచిక పుల్లకూడా అపహరించలేదు.

# 19

దట్టంగా పెరిగివున్న ఒక నట్టడవి మధ్య ఒకచోట కొద్ది మాత్రపు ఖాళీ స్థలం వుంది, అక్కడ చెట్లూ చేమలూ లేవు చుట్టూ మాత్రం దట్టంగా పెరిగినఆకులు కొమ్మలతో చెట్లు ఆవరించి వుండడం వల్ల ఈ ఖాళీ స్థలం ఎవరికీ కనిపించదు. ఆ స్థలం చుట్టూరా మట్టితో కట్టిన గోడవుంది. ఆ లోపల వున్న నేల లోతుగా తవ్వబడివుంది. ఆ లోతైన ప్రదేశంలో చుట్టూరా మట్టికొంపలు, డేరాలూ వున్నాయి. వాటిని 'భూగృహాలు' అని చెప్పుకుందాం.

చుట్టూవున్న ఇళ్ళముందు, ఖాళీ ప్రదేశంలో కొంత మంది మనుష్యులు గుంపుగా కూర్చుని భోజనాలు చేస్తున్నారు. వాళ్ళ మధ్య ఒక డేగిశా మరుగుతూవుంది. వాళ్ళు దరించిన దుమ్ముగేగిన దుస్తులను బట్టి, వాళ్ళ ప్రక్కనున్న ఆయుధాలను బట్టి, వాళ్ళు దొంగలని వెంటనే తెలిసిపోతుంది. మట్టి గోడమీద కాలుమీదకాలు వేసుకొని కూర్చుని ఒకడు కాపలా కాస్తున్నాడు. తను వేసుకున్న దుస్తులో ఒకచోట అతుకు వేసి సూదితో కుడుతున్నాడు. గాని ఆ దర్జీవాడి నేర్పరితనం పనికిరావడంలేదు. క్షణక్షణానికి

వాడు అన్ని వేపులా దృష్టిసారించి చూస్తున్నాడు.. వాడి ప్రక్కన పెద్ద తుపాకీ వుంది.

సారా కప్పు ఒక చేతినుండి మరొక చేతికి ఎన్నో మార్లు తిరుగుతున్నప్పటికీ ఆ గుంపు వింతగా నిశ్శబ్దంగా వుంది. భోజనాలయిం తర్వాత అ దొంగలు ఒకరి తర్వాత ఒకరు లేచి, ఒకరితో ఒకరు ఏవో రెండు మాటలు మాత్రం మాట్లాడుకొని, విడిపోయారు. కొందరు డేరాలలోకి వెళ్ళి పోయారు. మరికొందరు అడవిలోకి వెళ్ళిపోయారు. ఇంకొందరు రష్యా దేశాచారం ప్రకారం తిన్న దగ్గరే నిద్రపోవడం మొదలు పెట్టారు

కావలివాడు కుట్టు పని ముగించి, బట్టనొకసారి విదలించి పట్టుకొని, కుట్టిన మాసిక భేషుగ్గా వుందని తన పని తనానికి తనే మెచ్చుకున్నాడు. సూదిని చొక్కాకు గుచ్చి, తుపాకి రెండు కాళ్ళ మధ్యా వుంచి, చక్కని కంఠస్వరంతో పాతకాలపు జంటపదం పాడడం మొదలు పెట్టాడు.

నిలుపుమా నిట్టూర్పు రొదలిక
అలరు పచ్చని అడవితల్లీ!...
తలపులకు నా కడ్డు మరి రా
వలదు తెగువరి చిన్నవాడా...

ఇంతలో పూరిగుడిసె తలుపులు తెరచుకొని, తెల్లని టోపీ వేసుకున్న ఒక స్త్రీ గుమ్మం దగ్గర నిలబడింది.

'స్టెప్కా! కొంచెం నీ నోరు కట్టిపెట్టు. మన యజమాని ఇక్కడ నిద్రపోతుంటే ఏమిటి నీ గావు కేకలూ

నువ్వెన్నూ. బుద్ధీ, జ్ఞానం లేదూ?" అని కావలి వాడిని కసిరింది.

'మన్నించు యెగోరోవ్నా! పొద్దం మానేస్తాను. మన యజమాని బాగా నిద్రపోయి వేగం నిమ్మళించడమే కావాలి." అన్నాడు స్టెపాక్.

యెగోరోవ్నా వెళ్ళిపోయి, మట్టి గోడమీద అటూ ఇటూ పచారు చెయ్యడం మొదలు పెట్టింది.

యెగొరోవ్నా యే గుమ్మం దగ్గర నుంచుని స్టెపాక్‌ని మందలించిందో ఆ యింటిలోనే గోడపక్కనున్న మంచం మీద గాయపడిన మన డుబ్రోవుస్కీ పడుకొని వున్నాడు. పక్కనున్న బల్లమీద అతని పిస్తోళ్ళు వున్నాయి. అతని కత్తి గోడకి వ్రేలాడుతోంది. గది గోడలికీ, గదిలోని నేలమీదా ఖరీదైన తివాచీలు అమర్చబడ్డాయి. ఒక మూలని బల్లమీద పెద్ద అద్దం, ఆడవాళ్ళ వెండి అలంకరణ పాత్రలూవున్నాయి. డుబ్రోవుస్కీ చేతుల్లో తెరచిన పుస్తకం ఒకటి వుంది. కాని అతని కళ్ళు మాత్రం మూసి వున్నాయి. యెగొరోవ్నా దూరాన్నించి తొంగి చూస్తూనే వుంది. అతను నిద్ర పోయాడో, ఆలోచిస్తూవున్నాడో ఊహించలేక పోయింది.

అకస్మాత్తుగా డుబ్రోవుస్కీ ఉలిక్కిపడ్డాడు - అవతల నుండి ఏదో శబ్దం వినిపించింది-స్టెపాక్ కిటికీలోంచి తల పెట్టి చూశాడు.

'బాబుగారూ! అదే మన గుర్తు! వాళ్ళు మన కోసం చూస్తున్నారు." అన్నాడు.

డుబ్రోవుస్కీ మంచంమీదనించి తటాలున లేచాడు.

ఆయుధాలు పట్టుకున్నాడు. ఇల్లుదాటి బయటికి వచ్చాడు. బయటనున్న తన అనుచరులలో బయలుదేరిన కోలాహలం తను కనుపించగానే పూర్తిగా తగ్గిపోయి నిశ్శబ్దమయింది.

'అందరూ ఇక్కడే వున్నారా?' అని దుబ్రోవుస్కీ అడిగాడు.

"అంతా ఇక్కడే వున్నారు. ఒక్క గూఢచారులు తప్ప," అని జవాబు వచ్చింది.

"ఎవరి స్థానంలో వాళ్ళుండండి." అనిదుబ్రోవుస్కీ హెచ్చరిక చెయ్యగానే దొంగలు ఎవరి స్థానంలోకి వాళ్లు వెళ్లిపోయారు.

ఆ సమయంలోనే ముగ్గురు గూఢచారులు పరుగెత్తు కుంటూ దేవిడీల దగ్గరకి వచ్చారు. దుబ్రోవుస్కీ దేవిడీ దగ్గర వాళ్ళని కలుసుకున్నాడు.

"ఏం జరిగింది?" అని ప్రశ్నించాడు.

'సిపాయీలు అడవిలోకి చొరబడి మనల్ని చుట్టు ముట్టి మనమీాదదాడి చెయ్యడానికి వస్తున్నారు దొరా!' అని వేగులవాళ్లు రోజుకుంటూ చెప్పారు.

వెంటనే దుబ్రోవుస్కీ దేవిడీ తలుపులు మూాయించి, పెద్ద తుపాకీ మంచి స్థితిలో వుందో లేదో పరీక్ష చెయ్యడం మొదలు పెట్టాడు. అడవిలోంచి ఏవో కంఠస్వరాలు విని పించి, రానురాను మరింత దగ్గరపడ్తున్నాయి ఆకస్మాత్తుగా ముగ్గురు నలుగురు సిపాయీలు కనిపించి తటాలున వెనక్కి తిరిగి, వాళ్ల వెనక దూరంగా వున్న తోటి సిపాయీలకి గుర్తుగా తుపాకులు గాలిలోకి పేల్చారు.

"యుద్ధం చెయ్యడానికి అంతా సిద్ధంగా వుండండి;" అని డుబ్రోవుస్కీ దొంగలందరికీ హెచ్చరించాడు.

దొంగల గుంపులో కొద్దిసేపు కలకలం వినిపించి మళ్లీ క్షణంలోనే పూర్తిగా నిశ్శబ్దమైపోయింది.

ఇప్పుడు దగ్గరకి సమీపిస్తున్న సిపాయీల పటాలం ధ్వనులు వినిపించసాగాయి. చెట్ల మధ్య ఆయుధాలు తళతళ మెరిశాయి. ఒక్క మారుగా సుమారు నూటయాభై మంది సిపాయీలు అడవిలోంచి ముందుకు ఉరికి దొంగల గూడెం చుట్టూవున్న గోడమీదకి రాసాగారు. డుబ్రోవుస్కీ పెద్ద తుపాకీ ఎక్కుపెట్టి; గురిచూసి, మీటలాగి విడిచి పెట్టాడు. అది విజయవంతంగా పేలింది. ఒక సిపాయి తల ఎగిరింది. మరో యిద్దరు సిపాయీలకి బలమైన గాయాలు తగిలాయి. మిగతా సిపాయీలలో తొట్రుపాటు, కలవరం చెలరేగింది. కాని సేనా నాయకుడు మాత్రం ముందడుగు వేసి ధైర్యంగా నడిచేసరికి మిగతా పటాలమంతా నడిచి గోడవేపు విజృంభించారు' దొంగలు చేతి తుపాకులూ, పిస్తోళ్లూ పేల్చారు. గొడ్డళ్లు చేతుల్లో వుంచేకొని గోడని కాపాడుతున్నారు. కొంత మంది ఆ ప్రేల్పులలో గాయాలుపడి, సుమారు ఇరవై ముప్ఫయి మంది సిపాయిలు పడిపోయినా, మిగతావాళ్లు లక్ష్యపెట్టక గోడమీదికి విజృభించి ఎక్కారు.

అప్పుడు సిపాయిలకీ దొంగలకీ బాహాబాహీ యుద్ధం జరిగింది. చేయీచేయీ కలిపి దెబ్బలాడుతున్నారు. సిపాయీలు గోడ పై భాగానికి వచ్చేశారు. దొంగలు ఇంక లాభం లేదని వెనక్కి తగ్గాలనుకుంటున్న సమయంలో డుబ్రోవుస్కీ సేనా నాయకుడి మీదికి ఉరికి అతని గుండెకి గురి

చూసి పిస్తోలు పేల్చాడు. సేనానాయకుడు వెల్లకిలా నేల మీద పడగానే కొందరు సిపాయీలు అతనిని మోసుకుంటూ అడవుల్లోపడి వెనక్కి పారిపోయారు. అడవి తల్లికి బరువుచేటుగా, నాయకుడు లేకపోగానే మిగతా సైనికులు శక్తులు తగ్గి తొట్రుపడ్డం మొదలుపెట్టారు. ఇదే అదునని దొంగలు వాళ్ళని కిందికి పడగొట్టి నేలమీదికితోసి పడేశారు. కిందపడ్డ సిపాయీలు గగ్గోలుపెట్టి, బొబ్బలుపెడుతూ పరుగెత్తి పారిపోయారు! దొంగలు వాళ్ళని అదరగొడ్తూ వెంటాడారు, చివరికి విజయం సంపాదించారు. డుబ్రోవుస్కీ శత్రువులు పారిపోయారని నిర్ధారణ చేసుకున్నాక, గాయపడిన వాళ్ళకి కట్లుకట్టి చికిత్స చేయవలసిందనీ; అన్ని వేపులా దృష్టివుంచి కావలికాయమనినీ, ఎవరూకూడా పొలిమేర దాటి వెళ్ళరాదనీ దొంగలికి ఆజ్ఞాపించి; తన పడక గదిలోకి వెళ్ళిపోయి తలుపులు వేసుకున్నాడు.

ఈ జరిగినసంఘటన అధికారులకి తెలియగానే డుబ్రోవుస్కీ చేస్తున్న అంతులేని అరాచకాలన్నీ నిజరూపంలో వాళ్ల కళ్ళ ముందు కనిపించాయి. కన్ను తెరిపించాయి. అతని ఉనికిపట్టు ఎక్కడ వుండేదీ ఆచోకీతీసి తెలుసుకున్నారు ఈ మారు ఒక పెద్ద సిపాయీల సైన్యాన్ని పంపించారు. డుబ్రోవుస్కీని ప్రాణాలతోగాని, శవాన్ని గాని తీసుకురావలసిందని ఉత్తరువులు చేసి పంపారు కాని వాళ్లు కొద్ది మంది దొంగల్ని మాత్రమే పట్టుకోగలిగారు. పట్టుబడ్డ దొంగలవల్ల అధికారులు తెలుసుకున్న దేమంటే డుబ్రోవుస్కీ వాళ్ళతో ఎన్నాళ్ళ నుంచో వుండనేలేదని.

[illegible]ర్నాడో రెండవనాడో తన అనుచరుల నందరిని పిలిచి, దుబ్రోవుస్కీ తను వాళ్ళని శాశ్వతంగా విడిచిపెట్టి వెళ్ళిపోడానికి నిశ్చయించుకున్నట్టు చెప్పాడు. వాళ్ళ జీవితాన్ని మార్చుకోమ్మని సలహా యిచ్చాడు.

"నేను మీ అందరికీ నాయకత్వం వహించడంవల్ల మీరంతా బాగుపడి ధనవంతులయ్యారు. మీ అందరి దగ్గరా కొన్ని కాగితాలు ఉన్నాయి. వాటివల్ల మీరు ఏదైనా మరో జిల్లాకి సురక్షితంగా చేరగలరు. అక్కడ మీరు గౌరవమైన వృత్తులు చేసుకుని కష్టపడి సంపాదించి హాయిగా మిగతా కాలాన్ని గడపండి. కాని మీరంతా నిజంగానే దొంగలు. అందువల్ల మీరీ దొంగవృత్తిని విడిచి పెడతారంటే నాకు నమ్మకంలేదు.

ఈ మాటలు అన్న తర్వాత దుబ్రోవుస్కీ వాళ్ళందరినీ విడిచివెళ్ళిపోయాడు. తనతో ఒక్క మనిషిని మాత్రం తీసుకువెళ్ళాడు. అతనెక్కడికి వెళ్ళాడో ఎవ్వరికీ తెలీదు. దొంగలికి తమ నాయకుడిమీద వుండే భక్తి విశ్వాసాలు అంతు లేనివని అందరికీ తెలుసు. అందుచేత వాళ్ళే అతనిని ఎక్కడో రహస్యంగా దాచి కాపాడుతున్నారేమో అన్న అనుమానం మొట్టమొదట చాలా మందికి కలిగింది. కాని తర్వాత ఈ అనుమానం సరైనదికాదని తేలింది. దారి దోపిళ్లూ ఇళ్లకాల్పులూ; దొంగతనాలూ ఒక్కసారిగా ఆగిపోయాయి. బాటసారులు సురక్షితంగా ప్రయాణాలు చేస్తున్నారు. మరికొన్ని నిదర్శనాలవల్ల దుబ్రోవుస్కీ ఆ దేశాన్నే విడిచి వెళ్లిపోయాడని తేలింది.